# వెన్నముద్దలు

★

మూడవ భాగం

★

★ కృష్ణకవి




ప్రచురణకర్తలు:

వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు,

పోస్టుబాక్సు 1372, మద్రాసు 1.

ముద్రాపకులు: శ్రీ రామా ప్రెస్, మద్రాసు.

ప్రథమ ముద్రణ: హేమలంబి శ్రావణం.

ప్రతులు: ... 1500






## ★ నాటికలు ★





## ★ ముఖ్యపాత్రలు ★

1. శ్రీకృష్ణుడు
2. రుక్మిణి
3. సత్రాజిత్తు
4. సత్యభామ
5. జాంబవంతుడు
6. జాంబవతి
7. బలరాముడు



# సత్యభామాపరిణయం

## ★ 1. వ్రరంగం ★

[ ఒక కథకుడు సత్యభామా పరిణయానికి సంబంధించిన గాథ చెబుతున్నాడు. ]

కథకుడు:

... శత్రురాజుల నందరినీ జయించి, శ్రీ కృష్ణుడు, రుక్మిణీదేవిని ద్వారకా నగరానికి తీసుకు వచ్చాడు. అక్కడ ...

" ధ్రువకీర్తినీ హరి పెండ్లియాడె నిజ చే
తో హారిణీ మానవై
భవ గాంభీర్య విహారిణీ, నిఖిల సం
పత్కారిణీ, సాధు బాం
ధవ సత్కారిణి బుణ్యచారిణి మహా
దారిద్ర్య సంహారిణీ
సువిభూషాంబర ధారిణీ గుణవతీ
చూడామణీ రుక్మిణీ "

... ఆ తరువాత కొంతకాలానికి, రుక్మిణీ దేవి కడుపు పండింది. పూర్వం, యీశ్వరుని కంటి మంట వల్ల భస్మమైన మన్మథుడు, ఆమెకు కుమారుడుగా పుట్టాడు. అతనికి, అతని తలిదండ్రులు, ప్రద్యుమ్నుడు అని నామకరణం చేశారు.

మన్మథుని భార్య అయిన రతీదేవి, కాలక్రమాన మాయావతి అనే పేరుతో భూలోకానికి వచ్చింది; వచ్చి, ప్రద్యుమ్నుని కలుసుకుంది.

అదలా ఉండగా ...

సత్రాజిత్తు అనేవాడు సూర్యుని పూజించి, 'శమంతకం' అనే ఒక దివ్యమణిని ప్రసాదంగా పొందాడు. ఆ మణికి యెంతో మహిమ ఉంది. అది యెక్కడ ఉంటే అక్కడ ప్రతి రోజూ యెనిమిది బారువుల బంగారం పుడుతుంది. అంతే కాదు; అది ఉన్న దేశం, నిత్య కళ్యాణం పచ్చతోరణంగా ఉంటుంది.

సత్రాజిత్తు, ఆ మణిని మెళ్లో వేసుకుని, ఓ నాడు ద్వారకా నగరానికి వచ్చాడు. ఆ మణి వెదజల్లే కాంతిలో, చూసే వారికి, అతడు సూర్యుడా అనిపించాడు.

అది చూసిన గోపకులు ఆశ్చర్యపోయినారు. ఆశ్చర్యపోవటమే కాదు; ఆ విషయాన్ని శ్రీకృష్ణునికి తెలియ జేయాలని పరిగెత్తారు కూడా!



# ★ 2. వ్యరంగం ★

[ ద్వారకలో, రుక్మిణీ కృష్ణులు చదరంగం ఆడుకుంటు న్నారు. అంతలో, గోపకులు అక్కడికి పరిగెత్తుకుంటూ వచ్చారు. ]

**గోపకులు:**

" నారాయణ దామోదర
నీరజ దళ నేత్ర చక్రి నిఖిలేశ గదా
ధారణ గోవింద నమ
స్కారము యదు పుత్ర నిత్య కల్యాణ నిధీ! "

[ రుక్మిణీ కృష్ణులు వారి వంక చూశారు. ]

**గోపకుడు: 1.**

" దివిజాధీశ్వరు లిచ్ఛయింతురు గదా
దేవేశ నిన్ జూడ యా
దవ వంశంబున గూఢ మూర్తివి జగ
త్త్రాణుండవై యుండగా
భవదీయాకృతి జూడ నే డిదె రుచి
ప్రచ్ఛన్న దిగ్భాగుడై
రవియో నీరజ గర్భుడో యొకడు నే
రన్ వచ్చె మార్గంబునన్ "

[ ఆ మాట విని, రుక్మిణీదేవి అమితంగా ఆశ్చర్యపడ్డది. శ్రీకృష్ణుడు విరగబడి నవ్వాడు. ]

**రుక్మిణి:** అదేమిటి ... అలా నవ్వుతారు?

కృష్ణుడు: ... వీళ్ల అమాయకత్వం చూసి ...!

[ గోపకులు, ఒకరి వంక ఒకరు వింతగా చూసుకున్నారు. కృష్ణుని అభిప్రాయం అర్థంకాక, రుక్మిణి, అతని వంకనే చూస్తూ ఉంది. ]

... ఆ కనిపించింది కమలాకరుడూ కాదు, కమల గర్భుడూ కాదు; శమంతక మణితో ప్రకాశించే సత్రాజిత్తు!

[ రుక్మిణీ కృష్ణులు ముసిముసి నవ్వులు నవ్వుకున్నారు. గోపకులు, వారి వంక తెల్లబోయి చూస్తూ నుంచున్నారు. ]



# ★ 3. ప్ర రం గం ★

[ కథకుడు ఆ పైన జరిగిన గాథ చెబుతున్నాడు. ]

**కథకుడు:** ... ఆ తరువాత ;

"అమ్మణి యాదవ విభునకు
నిమ్మని హరి యడుగ నాత డీక ధనేచ్ఛం
బొమ్మని పలికెను చక్రికి
నిమ్మణి యీకున్న మీద నే మౌ ననుచున్"

ఆ విషయాన్ని, హరి, అంతగా మనసుకు పట్టించుకో లేదు. ఆయన, అస లది మరచిపోయినాడు కూడా.

... సత్రాజిత్తునకు ఒక తమ్ము డున్నాడు. అతని పేరు ప్రసేనుడు. అత నొకరోజున ఆ శమంతక మణిని మెళ్లో వేసుకుని, వేటకు వెళ్లాడు.

అక్కడ ...



# ★ 4. వ్రణం ★

[ ప్రసేనుడు, విల్లుయొక్కు పెట్టి, ఒకచోట పొంచి నుంచున్నాడు. అంతలో, అతని వెనుకనుంచి ఒక సింహం వచ్చి, అమాంతంగా అతని మీద పడ్డది. అయినప్పటికీ ప్రసేనుడు కలవర పడలేదు. అతి చాకచక్యంతో వెనక్కు తిరిగి, దాంతో పోట్లాటకు తలపడ్డాడు.

ప్రసేనునికీ సింహానికీ మధ్య, తీవ్రమైన పోరాటం జరిగింది. అందులో చివరకు, సింహానికే విజయం చేకూరింది; ప్రసేనుడు మరణించాడు. ఆ వెంటనే, అతని మెళ్లో ఉన్న మణిని నోట కరచుకుని, ఆ వనరాజు తన నివాసానికి బయలు దేరాడు.

ప్రసేనునికీ, సింహానికీ మధ్య జరిగిన పోరాటాన్నీ, దాని పరిణామాన్నీ, ఆ దగ్గరలోనే ఉన్న జాంబవంతుడు చూశాడు. చూసి, ఒక్క గంతులో ఆ సింహం మీద పడ్డాడు. దాంతో హోరా హోరిగా పోట్లాడాడు. చివరకు దాన్ని చంపేశాడు.

మరుక్షణంలో, శమంతకమణి జాంబవంతుని వశమయింది. జాంబవంతుడు, అమితమైన సంతోషంతో, తన గుహ వేపు పరిగెత్తాడు. ]



## ★ 5. వ్రంగం ★

[ అది సత్రాజిత్తు మందిరం. అక్కడ, సత్రాజిత్తు, అమితమైన అశాంతితో అటూ యిటూ తిరుగుతున్నాడు. అతని మంత్రి ఒకడు అతని ప్రక్కనే ఉన్నాడు. ]

**సత్రాజిత్తు:**

... వేటకు వెళ్లినవాడు తిరిగి రాలేదంటే యేమనుకోవాలి ?

**మంత్రి:** ప్రసేనులకు వేటమీాద ఉన్న మోజు ప్రభువులకు తెలియక పోలేదు. వారు, యెక్కడో యే మృగ రాజు కోసమో కాపువేసి ఉంటారు ; రేపో మాపో సుఖంగా వచ్చి తీర్తారు !

**సత్రాజిత్తు:** ( సందేహంతో తల ఊపి )

... ఏమో ...! ఆ ధైర్యం మాకు లేకుండా పోయింది. మణికోసం, మాధవుడే మా వాణ్ణి చంపి ఉంటాడని, మా మనసు మరీమరీ చెబుతోంది. అంతే అయి ఉంటుంది కూడా !

[ అంటూనే, అతను, అమితమైన వేదనతో తిరిగి తిరుగ సాగాడు. అతని మంత్రికూడా, అంతకు ముందులేని అదో విధమైన ఆలోచనలో పడ్డాడు. ]



## ★ 6. వ్రరంగం ★

[ ద్వారకా నగరంలో, ఒకచోట, శ్రీకృష్ణ బలరాములు ముచ్చటించు కుంటున్నారు. ]

**బలరాముడు:**

... ఇంతకు మించిన అపవాదు యింకేమైనా ఉంటుందా ?

[ శ్రీకృష్ణుడు మౌనంగా ఉన్నాడు; యేదో దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు. ]

'... మణికోసం, మాధవుడే మావాణ్ణి చంపి ఉంటాడు' అని,ఆయన అందరితోనూ అంటున్నాడుట!

[ శ్రీకృష్ణుడు నిట్టూర్చాడు; తల పంకించాడు. ]

...ఉఁహుఁ! ఇది, నీ ఒక్కడికే కాదు; మన వంశానికి అంతకూ కూడా అప్రతిష్టే !

**కృష్ణుడు :** ఎవరో యేదో అన్నారని యింతగా బాధపడితే యెలా ?

**బలరాముడు:**

అన్నది యెవరో కాదు; సత్రాజిత్తు! అది కూడా, మన అందరికీ మాయని మచ్చను కల్పించే మాట! అది మనం గ్రహించుకోవద్దూ ?

**కృష్ణుడు:** నేను అది కాదనటం లేదు. అయినా, నిజానికి, యిందులో మన తప్పు యేముందీ అని !

**బలరాముడు:**

లేదని నీకూ నాకూ తెలుసు; అయితే మాత్రం యేం లాభం ? లోకానికి అదెలా అర్థమవుతుంది ?

[ 'అదీ నిజమే' అన్నట్టుగా శ్రీకృష్ణుడు తల ఆడించాడు; అక్కడి నుంచి కదిలాడు. బలరాముడు అతణ్ణి అనుసరించి వెళ్లాడు. ]



# ★ 7. ప్రాంగం ★

[ అదొక దట్టమైన అడవి. దూరంనుంచి సింహగర్జనలూ, పెద్దపులుల అరుపులూ వినిపిస్తున్నై. బలరామ కృష్ణులూ, కొందరు గోపకులూ, యేవో అడుగు జాడలు చూసుకుంటూ, ఆ ప్రదేశంలో తిరుగుతున్నారు. అంతలో, ఒక గోపకుడు, పరిగెత్తు కుంటూ వచ్చి, వారిని సమీపించాడు. ]

**గోపకుడు:** 1. కృష్ణా...! కృష్ణా...!! దొరికింది...దొరికింది !

**బలరాముడు:**

...ఏమిటది ?

**గోపకుడు:** 1. అదే నయ్యా...అదే! కాళ్లు నిగడ తన్ని, కడుపు ఉబ్బించి కదలకుండా పడుకుంది. ఇహ యెక్కడికి పోతుంది? దొరికిం దన్న మాటే! ఆహాః...!

[ అతని మాటలు విన్న గోపాలు రందరూ విరగబడి నవ్వారు. బలరామ కృష్ణులు మందహాసం చేశారు. ]

...నవ్వండి...నవ్వండి! ... నాదేం పోయింది ? ...అది అక్కడే ఉంటుంది ; నింద కృష్ణయ్య మీదే ఉంటుంది. మధ్య నాకెందుకూ అంట...యీ బాధ?

[ ఆమాట విన్నకృష్ణయ్య 'అదేమిటి?' అన్నట్టు అతని వంక చూశాడు. అంతలో అతను అక్కడ చతికిల బడ్డాడు. కృష్ణయ్య, అతణ్ణి లేవతీయండి అన్నట్టుగా గోపాలురకు సైగచేశాడు. ఆ వెంటనే గోపాలు రందరూ, అతణ్ణి తమ చేతులమీద యెక్కించుకున్నారు; 'గోవిందా...గోవింద !' అంటూ పైకి యెత్తారు. ]



# ★ 8. వ, ర ం గ ం ★

[ అడవిలో అదొక భాగం. గోపాలురు మోసుకు వెడు తున్న కుఱ్ఱవాడు, ఒక మహారాజు లాగా కూర్చుని, 'అటు .. యిటు' అంటూ వాళ్లకు దారి చెబుతున్నాడు.

అంతలో, వారి కెదురుగా, ఒక చనిపోయిన గుఱ్ఱం కని పించింది. దాన్ని చూసి, అందరూ ఆశ్చర్య పోయినారు; తమ చేతుల మీద ఉన్న కుఱ్ఱవాణ్ణి అమాంతంగా వదిలి వేశారు ; ఆ గుఱ్ఱంచుట్టూ మూగారు.

బలరాముడు గుఱ్ఱం ముందుకు వెళ్లి, దాని ముఖం మీద ఉన్న స్వర్ణ ఫలకం చూశాడు; నిట్టూర్చాడు. ]

**బలరాముడు:**

ఉఁహుఁ ... పాపం ! చివరికి అతని బ్రతుకు యిలా అడవి పా లయిందన్న మాట !

[ అది విని, కృష్ణయ్యకూడా నిట్టూర్చాడు. ]

**గోపకుడు: 2.**

...ఇవుగో...యిక్కడ, సింహం అడుగులు కని పిస్తున్నై; చూశారా ! ... ఇదుగో నెత్తురు చార! అది అతణ్ణి యిక్కడే చంపి, యెక్కడికో యీడ్చుకు పోయి ఉంటుంది !

[ అంటూనే అతను కొన్ని అడుగు జాడలు వారికి చూపిం చాడు. బలరామ కృష్ణులూ, గోపాలురూ, ఆ జాడలు చూసు కుంటూ అలాగే ముందుకు వెళ్లారు. ]



# ★ 9. వ, రంగం ★

[ అది అడవిలో మరొక భాగం. అక్కడ, ఒక మూలగా, ప్రసేనుని కళేబరం ఉంది. దారి పొడుగునా ఉన్న గుర్తులు చూసుకుంటూ బలరామ కృష్ణులూ, గోపాలురూ అటుగా వెళ్లారు.

ప్రసేనుని శవాన్ని ముందుగా బలరాముడు చూశాడు.]

**బలరాముడు:**

హరిహరీ...! ఎంతఘోరం ?

**గోపాలుడు:** 3. ( బలరాముని ఉద్దేశించి )

...ఇదుగో...యిక్కడే ఆ సింహం మరో సింహంతో పోట్లాడింది; చూశావా ?

**బలరాముడు:**

( గుర్తులు పరీక్షగా చూసి )

ఊఁ... ! ఈ అడుగులు సింహానివి కావు; భల్లూకానివి !

**గోపాలుడు:** 2.

( దూరానికి చూసి )

...అదుగో...సింహం !

3. ...అరెరె...అదీ చచ్చిపోయిందే !

4. ఊఁ... ! ఇక మనకు ఆ భల్లూకం కనబడా లన్న మాట !

[ 'అంతే' అన్నట్టుగా గోపాలురు తలలూపారు. బలరామ కృష్ణులను అనుసరించి, ఆ సింహం పడి ఉన్న వేపుగా వెళ్లారు.]



## ★ 10. వ, రంగం ★

[ ఆ అడవిలోనే, యింకో చోట, యేవేవో అడుగు జాడలు చూసుకుంటూ, గోపాలురూ, బలరామ కృష్ణులూ మెల్ల మెల్లగా వెడుతున్నారు. ]

**బలరాముడు:**

ఇంకా సందేహం దేనికి; ఆ సింహాన్ని చంపింది జాంబవంతుడే!

[ బలరాముడు ఆ మాట అంటూనే ముందుకు వెళ్లాడు. కృష్ణయ్య, యేదో దీర్ఘంగా ఆలోచిస్తూ బలరాముని అను సరించాడు. ]



# ★ 11. వ, రంగం ★

[ అదొక గుహ. శ్రీకృష్ణ బలరాములూ గోపాలురూ ఆ గుహను సమీపించారు. ]

**బలరాముడు:**

ఊఁ...! ఆ జాంబవంతుని నివాసం యిదే అన్నమాట!

[ 'అంతే అయి ఉంటుంది' అన్నట్టుగా కృష్ణయ్య తల ఆడించాడు. బలరాముడు గుహ లోపలకు చూశాడు. చూస్తూనే... ]

... అబ్బ...! చీకటి గుంఝూరంగా ఉందే!

**గోపకుడు: 3.** కన్ను పొడుచుకు చూసినా కనబడటం లేదు!

**కృష్ణయ్య:** ( మందహాసం చేస్తూ )

అదృష్టం పట్టేముందు యెవరైనా సరే అటువంటి చీకట్లోనే మునిగిపోతారు!

[ బలరాముడు చిరునవ్వు నవ్వాడు. గోపాలురు జరుగబోయేది ఊహించుకుని ఒకరి వంక ఒకరు భయంభయంగా చూసుకున్నారు. కృష్ణయ్య మాత్రం మందహాసం చేస్తూనే ఉన్నాడు. ]

... సరే ...! నుంచుంటే యేమౌతుంది? ... వెళ్లొస్తాను!

[ అంటూనే లోపల ప్రవేశించాడు. బలరాముడు యేదో అనబోయి, ఆగిపోయినాడు. కృష్ణయ్య అది గ్రహించాడు.]

... మీా రందరూ యిక్కడే ఉండండి!

[ ఆ మాట అంటూనే కృష్ణయ్య లోపలకు వెళ్లాడు. గోపాలురు అదో విధమైన బాధతో అతని వేపు చూస్తూ నుంచుని పోయినారు.]



# ★ 12. వ, రంగం ★

[ అది గుహ లోపలిభాగం. కోటిమంది సూర్యుల వెలుగుతో ఆ ప్రదేశమంతా 'జిగేల్ జిగేల్' మంటూ ఉంది.

కృష్ణయ్య అక్కడికి వచ్చాడు. ఆ వెలుగు చూసి ఆశ్చర్య పోయినాడు. అంతలో, ఒక బంగారపు తొట్టె అతనికి కనిపించింది. అతను అటుగా వెళ్లాడు.

ఆ తొట్టెలో శమంతకమణి వ్రేలాడుతోంది. అది చూసిన కృష్ణయ్యకు ఆ గుహ నంతనీ వెలుగుతో నింపిన దేమిటో అప్పుడు అర్థమయింది.

కృష్ణయ్య, ఆ మణిని పమీపించి, పరీక్షగా చూశాడు. చూసీ చూడటం తోటే, దాన్ని అమాంతంగా తీసుకోవాలని ఆయనకు అనిపించింది. ఆ అభిప్రాయంతోనే ఆయన దానిమీద చేయివేశాడు కూడా.

అంతలో, ఆ తొట్టెలో పడుకుని ఉన్న పసిపాప కెవ్వు కెవ్వన యేడ్చింది. కృష్ణయ్య, తొట్టెలోకి చూశాడు ; అలాగే నిలబడి పోయినాడు.

అంతవరకూ, అక్కడే ఓ ప్రక్కగా గుఱ్ఱుకొట్టి నిద్దుర పోతున్న దాది అమాంతంగా లేచింది. లేచి .. ]

**దాది:** ... మహారాజా ... మహారాజా ... !! దొంగలు దొంగలు !!

[ దాది అలా కేకలు పెట్టగానే, ఆ తొట్టెలో ఉన్న పిల్ల యేడుపు మరీ యెక్కువ అయింది అంతలో, లోపలినుంచి, భల్లూకేశ్వరుని హుంకారాలు వినిపించినై. మరుక్షణంలో, జాంబవంతుడు అక్కడకు వచ్చాడు. వచ్చీ రావటంతోటే వికటాట్టహాసం చేశాడు; కృష్ణయ్య మీద కలియబడ్డాడు. ]



# ★ 13. వ్రంగం ★

[ ఒక కథకుడు ఆ తరువాత జరిగిన గాథ చెబుతున్నాడు. ]

**కథకుడు:** ... కృష్ణయ్యకూ జాంబవంతునకూ మధ్య అతి ఘోరమైన పోరు సాగింది.

" అడిదములు దగులు విరిగిన
బెడిదము లగు మగతనముల బిఱుతివక వడిం
బిడుగుల వడువున బడియొడి
పిడికిటి పోటులను గలన బెరసి రిరువురున్ "

ఆ పోట్లాట పన్నెండు రోజులపాటు అఖండంగా సాగింది. రాత్రీ పగలూ అని లేకుండా కృష్ణయ్యా జాంబవంతుడూ యెవరి బలాన్ని వారు ప్రదర్శించారు.

పన్నెండురోజు లయినా, కృష్ణయ్య బయటకు రాకపోవటం చూసి, గుహ వెలుపల ఉన్న గోపాలురూ బలరాముడూ కూడా అమితంగా భయపడి పోయినారు. వారి విచారానికి అంతు లేక పోయింది. ఇక అక్కడ ఉండి లాభం లేదని, వాళ్లందరూ, నిశ్చయించుకున్నారు; యేమి చేయటానికీ తోచక, విచారంతో తిరిగి యిళ్లకు వెళ్లారు.
అక్కడ ...



## ★ 14. వ, రంగం ★

[ అది దుర్గాదేవి ఆలయం. అక్కడ గుడిగంటలు ఒకే పనిగా మోగుతున్నై.

దేవకీ వసుదేవులూ, రుక్మిణీదేవీ మరి కొందరు పెద్దలూ ఆ ఆలయంలో ఉన్నారు. "కృష్ణా! కృష్ణా!' అన్న శబ్దం ఆ గంటల మోతలో లీనమై పోతోంది. అంతలో .. ]

**ఆకాశవాణి:**

... శ్రీ కృష్ణుడు క్షేమంగానే ఉన్నాడు. త్వరలోనే యింటికి రాబోతున్నాడు. ఆందోళన పడకండి! ఆనందంతో ఉండండి!

[ ఆ మాటలు విన్న అందరూ ఆశ్చర్యంతో నలుదిక్కులా చూశారు; ఆపైన ఒకరివంక ఒకరు చూసుకున్నారు. ఆ పలుకులు ఆకాశవాణివే అని నిశ్చయించుకున్నారు. తిరిగి అందరూ దుర్గకు సాష్టాంగ పడ్డారు. ]



## ★ 15. వ, రంగం ★

[ కథకుడు, ఆ తరువాత జరిగిన గాథ చెబుతున్నాడు. ]

కథకుడు: ... అక్కడ గుహలో ...

" పలలములకు బోరెదు డే
గల క్రియ శస్త్రముల దరుల గరముల విజయే
చ్ఛల నిరువది యొనిమిది దిన
ములు బోరిరి నగచరేంద్ర ముఖ్యుడు
హరియున్ "

అప్పటికి, జాంబవంతునిలో ఉన్న శక్తి అంతా క్షీణించి పోయింది. ముష్టియుద్ధం చేయటం వల్ల అతని ఒళ్లంతా హూనాహూనం అయిపోయింది అంతవరకూ అతనిలో ఉన్న ఆశలన్నీ అడుగంటి పోయినై. కృష్ణయ్యను జయించటం కలలో మాట అని, అతను అప్పుడు తేల్చుకున్నాడు ; తాను బ్రతికి బయటపడితే చాలు ననుకున్నాడు.

అంతలో అతని స్ఫురణకు వచ్చింది; శ్రీకృష్ణుడు శ్రీమన్నారాయణుడే అని. త్రేతా యుగంలో తాను కొలిచిన రఘు రాముడే శ్రీకృష్ణుడై తనముందు ఉన్నాడూ అని. ఆ విధమైన జ్ఞానోదయం కాగానే, జాంబవంతుడు...



## ★ 16. వ, రంగం ★

[ జాంబవంతుడు కృష్ణయ్య ముందు మోకరిల్లి ఉన్నాడు; కృష్ణయ్య అతని వంక సానుభూతితో చూస్తున్నాడు. ]

**జాంబవంతుడు:**

... పురాణ పురుషా!

"బాణాగ్ని నెవ్వాడు పఱపి పయోరాశి
నింకించి బంధించి యేపు మాపె
బరగ నెవ్వాడు ప్రతాప ప్రభారాశిచే
దానవ గర్వాంధ తమస మడచె
గంజాతములు ద్రెంచు కరిభంగి నెవ్వాడు
దశ కంఠు కంఠ బృందములు ద్రుంచె
నా చంద్ర సూర్యమై యమరు లంకారాజ్య
మునకు నెవ్వాడు విభీషణుని నిలిపె
నన్ను నేలిన లోకాధి నాథు డెవ్వ
డంచి తోదార కరుణా రసాబ్ధి యెవ్వ
డాతడవు నీవ కావె మహాత్మ నేడు
మాఱుపడి యొగ్గు నేసితి మఱవ వలయు!"

[ కృష్ణయ్య మందహాసంచేస్తూ జాంబవంతుని లేవనెత్తి కౌగిలించుకున్నాడు; ప్రేమతో అతని ఒళ్లంతా నిమిరాడు. ]

**కృష్ణయ్య:** ... జాంబవంతా!

( శమంతక మణిని చూపుతూ )

"ఈ మణి మాచే బడెనని
తామసు లొనరించు నింద దప్పెడు కొఱకై
నీ మందిరమగు బిలమున
కే మగుదెంచితిమి భల్లుకేశ్వర వింటే!"

**జాంబవంతుడు:**

(పశ్చాత్తాపంతో)

అయ్యయ్యో...యెంత పనయింది ? నామూలంగా నా స్వామికి అపవాదు సంభవించిందా ? నా కన్న తండ్రికి నేనే బాధ కలిగించానా ? ఎంత అపచారం చేశాను ! ఎంతటి పాపాన్ని ఒడిగట్టుకున్నాను! స్వామీ ...! స్వామీ ... ! !

[ అలా అంటూనే జాంబవంతుడు శ్రీకృష్ణుని కాళ్లమీద పడ్డాడు. ]



## ★ 17. వ, ర ం గ ం ★

[ కథకుడు ఆ తరువాత జరిగిన గాథ చెబుతున్నాడు. ]

కథకుడు: ... పరమభక్తుడైన జాంబవంతుడు, అలా పశ్చాత్తాపపడి, పాప పరిహారార్థం, ఆ మణితో పాటు, బాలామణి అయిన తన కుమార్తెను, జాంబవతిని, కూడా శ్రీ కృష్ణునకు సమర్పించుకున్నాడు.

ఆ విధంగా ...

"యత్నము సఫలంబయిన స
పత్న సమూహములు బెగడ బద్ధాత్ముం డా
రత్నముతో కన్యాజన
రత్నముతో బురికి వచ్చె రయమున నంతన్"

"మృతుడైనవాడు పునరా
గతుడైన క్రియం దలంచి కన్యామణి సం
యుతుడై వచ్చిన హరి గని
వితతోత్సవ కౌతుకముల వెలసిరి పౌరుల్"

ఆ తరువాత ...



# ★ 18. వ్రతం ★

[ అది ద్వారకా నగరంలోని రాజమందిరం. అందులో శ్రీకృష్ణుడు కొలువు దీరి ఉన్నాడు. అతనికి ఒక వంక బలరాముడూ, మరొకవంక సత్రాజిత్తూ కూర్చుని ఉన్నారు. కొందరు గోప ప్రముఖులు కూడా ఆ సభ నలంకరించారు.

సత్రాజిత్తు తలవంచుకుని కూర్చున్నాడు. అతనిలో అమిత మైన పశ్చాత్తాపం గోచర మౌతోంది. బలరాముడు అతని వంక అదో విధంగా చూస్తున్నాడు 'ఇదే యిత్తనికి తగినశాస్తి' అన్న భావం అతని కళ్లల్లో కనబడుతోంది.

కృష్ణయ్య, శమంతక మణిని పరీక్షగా చూస్తున్నాడు; దాని ప్రభావాన్ని తలచుకుని అచ్చెరు వందుతున్నాడు.

అలా కొంతసేపు గడిచింది. కృష్ణయ్య, సత్రాజిత్తు వంక చూశాడు; చూసి .. ]

**కృష్ణయ్య:** ఊఁ ...! ఇదుగో ... మీ శమంతకం!

[ అంటూ, దాన్ని సత్రాజిత్తు ముందు ఉంచాడు. సత్రాజిత్తు దాన్ని తీసుకోవటానికి సందేహించాడు. ]

**బలరాముడు:**

... మీది మీరు తీసుకోవటానికి కూడా సందేహిస్తే యెలా ?

[ ఏదో చెప్పరాని బాధతో, సత్రాజిత్తు బలరాముని వంక ఓరగా చూశాడు ; తిరిగి తలదించు కున్నాడు. ]

**కృష్ణయ్య:** ... ఫరవాలేదు ... తీసుకోండి!

[ సత్రాజిత్తు, అమితమైన లజ్జతో కృష్ణయ్యవంక చూశాడు. కృతజ్ఞతాభారంతో క్రుంగి పోయినాడు; కన్నీరు కార్చాడు. అది గ్రహించిన కృష్ణయ్య అతని వంక సానుభూతితో చూశాడు. ]

**బలరాముడు:**

మణిని గురించి తను మాధవుణ్ణి అన్న మాటలూ, తన మణిని తనకు చేర్చటానికి మాధవుడు పడ్డపాట్లూ మననం చేసుకుంటున్నారు కాబోలు !

[ బలరాముడు గొంతెత్తి పొడుపుగా అన్న ఆ మాటలు సత్రా జిత్తును మరింత క్రుంగదీసినై. అతను, 'మాధవా!' అంటూ అమాంతంగా కృష్ణయ్యను చుట్టేసుకున్నాడు. బలరాముడు అదోవిధమైన సంతృప్తితో తల ఆడించాడు. కృష్ణయ్య, 'ఎటువంటివాణ్ణి అయినా యింతగాం యేడిపించటమా?' అన్నట్టు బలరాముని వంకా, 'ఆనాడు అనకుండా ఉంటే యీనాడు పడేపని ఉండేదా?' అన్నట్టు సత్రాజిత్తు వంకా చూశాడు. కృష్ణయ్య ఔదార్యాన్ని అభినందిస్తూ, గోపాలురు ఒకరి వంక ఒకరు చూసుకున్నారు. ]



## ★ 19. వ్రంగం ★

[ అది సత్రాజిత్తు మందిరం. అతని కుమార్తె, సత్యభామ, అతని రాకకోసం యెదురుచూస్తూ, మేడమీది పంచపాళిలో నుంచుని ఉంది.

అంతలో, రథం వచ్చి ద్వారంలో ఆగిన ధ్వని అయింది. ఆమె ముఖంలో అదోవిధమైన ఆనందం ప్రవేశించింది. ఆమె, ఆ ఆనందాన్ని అణచుకోవటానికి ప్రయత్నిస్తూ వెను దిరిగే టప్పటికి, సత్రాజిత్తు అక్కడకు రానే వచ్చాడు.

సత్రాజిత్తు, తనలోని విచారాన్ని కప్పి పుచ్చుకుంటూ, చిరునవ్వుతో, సత్యభామకు శమంతకాన్ని అందించాడు.

తండ్రి వాలకం చూసిన సత్యభామ, శమంతకాన్ని పొందిన సంతోషాన్ని వెలిబుచ్చలేక పోయింది. అతని వంకనే చూస్తూ నిలబడి పోయింది. ]

**సత్యభామ:** ... ఇదేమిటి...యిలా ఉన్నారు?

**సత్రాజిత్తు:** ... ఏమీ లేదమ్మా ... యేమీలేదు! ఈ మణి విషయంలో ఆ మహానుభావుణ్ణి అనరానిమాట లన్నాను. ఆయనపట్ల చెయ్యరాని అపచారం చేశాను. ఆయన, నన్నుగురించి యేమనుకున్నాడో యేమో!

**సత్యభామ:** ... ఇంతకూ, మిమ్మల్ని యేమన్నారు?

**సత్రాజిత్తు:** ఏమీ అనలేదమ్మా! ఏమాత్రంగా అయినా మందలించి ఉంటే మనకీ బాధ ఉండేదే కాదు!

ఆయన, మందహాసంతో, మన మణిని మనకు యిస్తుంటే, ఆయన్ని చూడటానికే నాకు సిగ్గేసింది.

[ ఆ మాటలు విన్న సత్యభామ కళ్లు మిలమిలలాడినై. ఆమె, సిగ్గుతో తల వాల్చుకుంది. ]

... ఆ దివ్యమంగళ విగ్రహం ముందు, నేను, ఒక దీనాతిదీనుడి మాదిరి నిలబడ్డానమ్మా! నిజంగా ఆయనకు సాటి ఆయనే! ... అంతే!

[ సత్యభామ ముఖంలో ఒక వెలుగు కనిపించింది. ]

... ఊఁహూఁ!

" పాపాత్ముల పాపములం
బాపంగా నోమునట్టి పద్మాక్షునిపై
బాపముగలదని నోడివిన
పాపాత్ముని పాపమునకు బారము గలదే "

అయినా ...

" మితభాషిత్వము మాని యేల హరిపై
మిథ్యాభి యోగంబు చే
సితి బాపాత్ముడ నర్థలోభుడను దు
శ్చిత్తుండ మత్తుండ దు
ర్మతి నీ దేహము గాల్పనే దురితమే
మార్గంబునన్ బాయు నే
గతి గంసారి ప్రసన్నుడై మనుచు నన్
గారుణ్య భావంబునన్ "

... నిజంగా ఆ జాంబవంతుడు ధన్యుడమ్మా! ఈ మణితోపాటు, అతను, తన పుత్రికామణిని కూడా మాధవునకు సమర్పించుకున్నాడు. అటువంటి అల్లుణ్ణి సంపాదించుకునే అదృష్టం అందరికీ లభిస్తుందా... ?

[ సత్యభామ, అమితమైన లజ్జతో, అడుగుల్లో అడుగులు వేసుకుంటూ, అక్కడినుంచి, కదిలింది.

తన కుమార్తె హృదయంలో ఉన్న అభిప్రాయాన్ని, ఆమె చూపుల ద్వారా, సత్రాజిత్తు గ్రహించాడు; సంతృప్తితో తల పంకించాడు. అతనిలో అంతకు పూర్వంలేని జీవకళ అప్పుడు ప్రవేశించింది. ]



# ★ 20. వ, రంగం ★

[ కథకుడు ఆ తరువాత జరిగిన గాథ చెబుతున్నాడు. ]

కథకుడు: ... తాను చేసిన మహాపరాధానికి తగిన ప్రాయశ్చిత్తం యేమిటా అని ఆలోచిస్తున్న సత్రాజిత్తుకు జాంబవంతుడు చేసిన పనే సక్రమమైనదని తోచింది. అతని అభిప్రాయంతో అతని కుమార్తె కూడా యేకీభవిస్తోందని అతను గ్రహించాడు. అందుకనే ...

"మణిని కూతు నిచ్చి మాధవు పదములు
పట్టుకొంటినేని బ్రతుకు గలదు
సంతసించు నతడు సదుపాయ మగు నిది
సత్య మితర వృత్తి జక్కబడదు"

అన్న నిర్ణయానికి కూడా వచ్చాడు. "సత్యభామనూ, శమంతకాన్నీ శ్రీకృష్ణునకు సమర్పించుకుంటాను. దానివల్ల, కృష్ణుని, ప్రేమను పొందినట్టూ అవుతుంది; కుమార్తె కోరిక తీర్చినట్టూ అవుతుంది"

"అని యిభ్భంగి బహుప్రకారముల నే
కాంతస్థుడై యింటిలో
దన బుద్ధిం బరికించి నీతిగని
సత్రాజిత్తు సంప్రాప్త శో
భనుడై యిచ్చె విపత్పయోధి
తరికిన్ భామా మనోహారికిన్

దనుజాధీశ విదారికిన్ హరికి
గాంతారత్నమున్ రత్నమున్ "

... ఆ తరువాత ...

"తామరసాక్షు డచ్యుతు డుదార
యశోనిధి పెండ్లియాడె నా
నా మనుజేంద్ర వందిత గుణస్థితి
లక్షణ సత్యభామ ను
ద్దామ పతివ్రతాత్వ నయ ధర్మ
విచక్షణతా దయాయశః
కామను సత్యభామను ముఖద్యుతి
నిర్జిత సోమ నయ్యెడన్ "

"మణి యిచ్చినాడు, వాసర
మణి, నీకును మాకు గలవు మణులు, కుమారీ
మణి చాలునంచు గృష్ణుడు
మణి సత్రాజిత్తునకును మరలగ నిచ్చెన్ "

"ఘనుడు భగవంతు డీశ్వరు
డనఘుడు మణి దెచ్చి యిచ్చినట్టి కథనమున్
వినిన బఠించిన దలచిన
జనులకు దుర్యశము బాపసంఘము దలగున్ "

... శ్రీమద్రమా రమణ గోవిందో హరి ! !



## ★ ముఖ్యపాత్రలు ★

1. శ్రీకృష్ణుడు
2. సత్యభామ
3. నరకాసురుడు
4. మురాసురుడు
5. భూదేవి



# నరకాసుర వధ

## ★ 1. వ, రంగం ★

[ ఒక కథకుడు నరకాసుర వధను సంబంధించిన గాథ చెబు తున్నాడు. ]

**కథకుడు:** ... సత్యభామా పరిణయం అయిన తర్వాత, శ్రీ కృష్ణుడు, పాండవులను చూసిరావాలని, ఒకసారి, యింద్రప్రస్థ పురానికి వెళ్లాడు. వెళ్లి ...

" అత్తా కొడుకులు గోడలు
చిత్తానందముగ బనులు సేయగ నాత్మా
యత్తానుగవై యాజ్ఞా
సత్తాదులు గలిగి మనుదె సమ్మోదమునన్ "

అని, తన మేనత్త అయిన కుంతీదేవిని పరామర్శించాడు.

అప్పుడామె అతనికి తగిన సమాధాన మిచ్చి, ఆతరువాత, కౌరవులపాలనలో తన బిడ్డలు పడుతున్న పాట్లు వివరించి చెప్పింది. కృష్ణయ్య అవన్నీ సావధానంగా విన్నాడు. ఆమీద, ధర్మరాజు, శ్రీకృష్ణుని పూజించి...

" పట్టుగ లేరు నిన్ను దమ
భావములందు సనందనాదులే
పట్టున నైన నట్టి గుణ
భద్రచరిత్రుడ వీవు నేడు మా
చుట్టమ వంచు వచ్చెదవు
చూచెద వల్పులమైన మమ్ము నే
మెట్టి తపంబు సేసితి మ
ధీశ్వర పూర్వ శరీర వేళలన్ "

అని యెంతగానో ప్రశంసించాడు.

ఆ తరువాత, పాండవుల ప్రార్థనమీద శ్రీ కృష్ణుడు అక్కడే కొన్ని నెలలు గడిపాడు.

... ఒక రోజున, శ్రీ కృష్ణుడూ అర్జునుడూ మొదలైన వాళ్లు, యమునాతీరంలో ఉన్న అడవికి వేటకు వెళ్లారు. అక్కడ, వారికి, ఒక చక్కని చుక్క కనిపించింది.

అర్జునుడు ఆ మెనుసమీపించాడు. సమీపించి...

"సుదతీ యెవ్వరి దాన వేమి కొఱకి
చ్చోటం బ్రవర్తించె దె
య్యది నీ నామము గోర్కి యెట్టిది వివా
హా పేక్షతో గూడి యీ
నదికిన్ వచ్చిన జాడ గానబడె ధ
న్యం బయ్యెనీ రాక నీ
యుదయాది స్థితి నెల్ల జెప్పు మబలా
యుద్యత్కుతూహలంగేక్షణా!"

అని పలుకరించాడు. దానిమీద ఆ కన్య...

"నరవీరోత్తమ యేను సూర్యుని సుతన్
నా పేరు కాళింది, భా
స్కర సంకల్పిత గేహమందు నదిలో
గంజాక్షు విష్ణుం బ్రభున్
వరుగా గోరి తపంబు సేయుదు నొరున్
వాంఛింప గృష్ణుండు వ
న్యరతిన్ వచ్చి వరించు నంచు బలికెన్
నా తండ్రి నాతోడుతన్"

అని సమాధానం చెప్పింది.

ఆ వెంటనే, అర్జునుడు ఆ విషయాన్ని శ్రీ కృష్ణునకు తెలియపరిచాడు. శ్రీ కృష్ణుడు, సంతోషంతో ఆమెను సమీపించాడు. మృదుమధురంగా మాట్లాడాడు. ఆమె కోరిక చెల్లించటానికి అంగీకరించి ఆమెను ఇంద్రప్రస్థ పురానికి తీసుకువెళ్లాడు.

ఇంద్రప్రస్థపురంలో కాళిందీ కృష్ణుల వివాహం అత్యంత వైభవోపేతంగా జరిగింది. అది అయిన కొన్నాళ్లకు, కృష్ణుని మేనత్త కూతురు, మిత్రవింద, శ్రీకృష్ణుని స్వయంవరంలో వరించింది. ఆమెనుకూడా ఆయన పెళ్లిచేసుకున్నాడు.

ఆ తరువాత, కోసల దేశాధిపతి అయిన నగ్నజిత్తు కూతురైన నాగ్నజితిని శ్రీ కృష్ణుడు భార్యగా స్వీకరించాడు. ఆపైన, తన మేనమఅదలైన శ్రుతకీర్తినీ, సద్గుణ సముద్ర అయిన భద్రనూ, మద్రరాజ కన్యక అయిన లక్షణనూ కూడా శ్రీ కృష్ణుడు వివాహం చేసుకోవటం జరిగింది. ఆ విధంగా, శ్రీ కృష్ణునకు రుక్మిణి, జాంబవతి, సత్యభామ, కాళింది, మిత్రవింద, నాగ్నజితి, భద్ర, లక్షణ అనే యెనిమిది మంది భార్యలైనారు.

అలా అష్టభార్యలతోనూ ఆనందంతో కాలం గడుపుతున్న శ్రీకృష్ణుని దగ్గఅకు, యింద్రుడు ఒకనాడు వచ్చి, భూలోకంలో, నరకాసురుని పాలన ఘోరంగా ఉన్నదనీ, అతనివల్ల దేవలోకం కూడా చికాకు పడిపోతోందనీ చెప్పాడు. అదివిన్న శ్రీ కృష్ణుడు...



# ★ 2. వ్ రంగం ★

[ శ్రీకృష్ణుడు తన ఆయుధాగారంలో ఉన్న విల్లమ్ములను పరీక్షిస్తున్నాడు. అంతలో సత్యభామ అక్కడకు వచ్చింది. ]

**సత్యభామ:** ...మళ్లీ యేదో ప్రయాణమల్లే ఉందే!

**కృష్ణుడు:** ఆఁ! ప్రాగ్జ్యోతిషపురం వెళ్లి రావాలి!

**సత్యభామ:** ( చిలిపిగా )

ఊఁ...! వెళ్లి, అక్కడున్న నరకుణ్ణి నరికి రావాలి; అంతేనా ?

**కృష్ణుడు:** ( ఆశ్చర్యంతో )

...అది నీ కెలా తెలిసింది ?

**సత్యభామ:** ...ఉఁహూఁ! నరకుని గురించీ నారాయణుని గురించీ ఒకరు మరొకరికి చెప్పేదేముంది ?

**కృష్ణుడు:** ( మందహాసంతో )

... అంటే...?

**సత్యభామ:** ఆ యిద్దరి మాటా అనుకోనివాళ్లే లే రన్న మాట! ఎవరిని కదిలించినా 'నరకుడు పదహారువేలమంది రాజకన్యలను చెరపట్టాడు; వాళ్లని ఆ నారాయణుడు యెప్పుడు అనుగ్రహిస్తాడో యేమో...' అనుకునే వాళ్లే!

[ ఆమాట అంటూనే సత్యభామ కిలకిల లాడించి. అది చూసి, కృష్ణుడు పకపకలాడాడు. ]

ఇంతకూ మీ ప్రయాణం అక్కడికే నన్నమాట !

కృష్ణుడు: ( ముక్త సరిగా )
ఊఁ... !

సత్యభామ: అయితే సరే ... బయలు దేరండి... !

[ అంటూనే తను కూడా విల్లమ్ములు పరిశీలించటం మొదలు పెట్టింది. ]

కృష్ణుడు: ఇదేమిటి ? వీటితో నీ కేం పని ?

సత్యభామ: అదంతా ఉందిలెండి...తరువాత చెబుతాను !

(ఒక విల్లు చూపుతూ )
చూడండి ! ఇది బాగుందా... ?

కృష్ణుడు: దేనికి...?

సత్యభామ: ముందు అడిగిన దానికి సమాధానం చెప్పండి ! ఇది బాగుందా లేదా ?

కృష్ణుడు: ( మందహాసంతో )
ఓ... భేషుగ్గా ఉంది !

సత్యభామ: అయితే...యిది నాది ! ఊఁ...యేదీ... ! కొన్ని అమ్ములుకూడా యిలా ఇవ్వండి !

కృష్ణుడు: ...ఎవరిమీదికి...యిదంతా ?

సత్యభామ: వాడిమీదికే ! ఊఁ...! ఇవ్వండి !!

కృష్ణుడు: ( నవ్వుతూ )
ఏమిటి...? నువ్వు యుద్ధానికి వస్తావా ?

సత్యభామ: ఓ... భేషుగ్గా ! నాకేమన్నా భయ మనుకున్నారా ?

కృష్ణుడు: అహఁహఁ...అది కాదు ; నానోటికి నువ్వు అడ్డుపడు తున్నావే అని !

సత్యభామ: ( పకపకా నవ్వి )

మీ రేం భయపడకండి! మీ నోటికి నేనేమీ అడ్డు రాను. అంతగా కావాలంటే, ఆ మహాప్రసాదాన్ని, నేనే మీ నోటికి అందిస్తాను కూడా! సరేనా ?

[ కృష్ణుడూ సత్యభామా పకపకలాడుతున్నారు. ]

కృష్ణుడు : ...ఇంతకూ నరకుని కోటలో చేరటమంటే...

సత్యభామ: మాటలు కాదంటారు; అంతేనా...?

కృష్ణుడు: ఆఁ...! అది మురాసురుని రక్షణక్రింద ఉంది!

సత్యభామ: ...ఉంటే...?

కృష్ణుడు: ఏం లేదు! అసలు, వా డెలా ఉంటాడో తెలుసా...?

సత్యభామ: ...ఎలా ఉంటాడేం ?

కృష్ణుడు: వాడికి ఐదు తల లున్నై!

సత్యభామ: ఊఁ...! పది కళ్ళున్నై. పది కాళ్ళున్నై. పది చేతు లున్నై. పది మూతులున్నై; అహాఁహాఁ...ఐదే మూతులు; అయిదే... అయిదే!

[ కృష్ణుడూ సత్యభామా ఐరగబడి నవ్వు తున్నారు. ]

కృష్ణుడు: ...అయినా నీకు భయంలేదన్నమాట!

సత్యభామ: భయమా?...దేనికి? మీరు ప్రక్కనే ఉంటారుగా!

[ ఆమాట అంటూనే సత్యభామ అతని కౌగిట్లోకి వెళ్ళి పోయింది. కృష్ణుడామెను హృదయానికి హత్తుకుని ముసి ముసి నవ్వులు నవ్వాడు. ]

...ఏమండీ...! నేను రావద్దా ?

...మీరు యుద్ధంచేస్తుంటే చూడాలని ఉందండీ!

**కృష్ణుడు:** ఊఁ...! పిచ్చిపిల్లా! యుద్ధం అంటే యేమనుకుంటు న్నావ్? అక్కడ కనబడేవీ వినబడేవీ యెంత భయం కరంగా ఉంటయ్యో తెలుసా? ఊఁ...?

( బుజ్జగిస్తూ )

"సమద పుష్పంధయ ఝుంకారములు కావు
భీషణ కుంభీంద్ర బృంహితములు
వాయునిర్గత పద్మ వనరేణువులు కావు
తురగరింఖాముఖోద్ధూత రజము
లాకీర్ణ జలతరంగాసారములు కావు
శత్రుధనుర్ముక్త సాయకములు
కలహంస సారస కాసారములు కావు
దనుజేంద్ర సైన్యకదంబకములు
కమల కహ్లారకుసుమ సంఘములు కావు
చటుల రిపుశూల ఖడ్గాది సాధనములు
కన్య నీ వేడ రణరంగ గమన మేడ
వత్తువేగమ నిలువుము వలదు వలదు."

**సత్యభామ:** ఉఁ హుఁ...! వీల్లేదు!!

**కృష్ణుడు:** ఊఁ...అయితే సరే! ఇక చేసేదేముంది?

[ కృష్ణుడూ సత్యభామా ఒకరి కళ్లల్లోకి ఒకరు చూసు కున్నారు. ]



## ★ 3. ప్రరంగం ★

[ అది ప్రాగ్జోతిష పురం. అక్కడి కోటచుట్టూ రాక్షసులు పహారా తిరుగుతున్నారు. శ్రీకృష్ణుడు సత్యభామతో సహా అక్కడ దిగాడు. వారి ప్రక్కనే వారి వాహనమైన గరుడు డున్నాడు.

సత్యభామను చూసి ఆ కావలివాళ్లు పగలబడి నవ్వారు. శ్రీకృష్ణుడు అది గ్రహించాడు. ముసిముసి నవ్వులతో సత్య భామ వంక చూశాడు. ]

**కృష్ణుడు :** ...వాళ్ల అందం ముందు నువ్వు యెందుకైనా పని కొస్తావా?

**సత్యభామ:** అందుకనే గాబోలు, వాళ్లు అలా నవ్వుతున్నారు!

[ సత్యభామా కృష్ణయ్యా కిల కిల లాడారు. అది చూసిన రాక్షసులు ఒక్కసారిగా ఉరిమారు. ఆ వెంటనే, కృష్ణయ్య, పాంచజన్యం పూరించాడు. అది విన్న రాక్షసులు 'అమ్మ బాబోయ్' అంటూ యెక్కడివాళ్లక్కడ నుంచే పరిగెత్తారు. అదిచూసిన కృష్ణయ్యా సత్యభామా కడుపుబ్బ నవ్వు తున్నారు. ]



# ★ 4. వ, రంగం ★

[ మురాసురుడు గాఢ నిద్రలో ఉన్నాడు. పాంచ జన్యం పూరించటం వల్ల కలిగినధ్వని ఆతనికి మెలకువ తెప్పించింది. ఆ వెంటనే అతను ఆవు లించాడు. నీల్గాడు. లేచాడు. భీకరంగా గర్జిస్తూ బయటకు వెళ్లాడు. ]



# ★ 5. వ, రంగం ★

[ నగరద్వారం ముందు శ్రీకృష్ణుడూ సత్యభామా ముచ్చటించు కుంటున్నారు. ]

**కృష్ణుడు :** ...అదుగో...మురాసురుడొస్తున్నాడు!

[ అంతలో మురాసురుడు వచ్చి ముఖద్వారంలో నిలబడ్డాడు; వికటాట్ట హాసంచేశాడు.

సత్యభామ కొంచెం భయపడ్డది. శ్రీకృష్ణునికి దగ్గరగా జరిగింది. అది చూసిన మురాసురుడు పగలబడినవ్వాడు.

శ్రీ కృష్ణ సత్యభామలు రెండడుగులు వెనక్కు వేశారు. ]

**మురాసురుడు :**

ఓ...! భార్యా సమేతంగా వచ్చావే! ఊఁహూఁ... పాపం! ఆమెకు కూడా బ్రతుకు భారంగా తోచింది కాబోలు!

[ అలా అంటూనే అతను తన చేతిలోని గదను వారిమీదకు విసిరివేశాడు. అది గ్రహించిన గరుడుడు ఆగదకూ శ్రీ కృష్ణ సత్యభామలకూ మధ్యగా నిలబడ్డాడు. కృష్ణయ్య, ఆ వెంటనే తన గదను మురాసురుని గదమీదకు విసిరాడు. దాంతో మురాసురుని గద తునాతునకలై పోయింది. ఆ వెంటనే మురాసురుడు గంభీరంగా అరుస్తూ, వారి మీదికి ఉరికాడు.

అదిచూసిన శ్రీ కృష్ణుడు ఆ వెంటనే తన చక్రాయుధాన్ని వదిలాడు. అది వెళ్ళి మురాసురుని ఐదుతలలూ నరికేసింది.



అంతలో మురాసురుని కొడుకులు తామ్రుడు, అంత రిక్షుడు, శ్రవణుడు, విభావసుడు వసుడు, నభస్వంతుడు, అరుణుడు అనేవాళ్లు అక్కడకు పరిగెత్తుకు వచ్చారు వారి దండనాథుడు పీఠుడు కూడా వారికి తోడుగా వచ్చాడు.

అలా వచ్చిన ఆ వీరు లందరూ కృష్ణయ్యను చూడగానే కాలికి బుద్ధి చెప్పారు. అదిచూసిన సత్యభామ వారిని గేలి చేస్తూ చప్పట్లు చరిచింది.

ఆ వెంటనే కృష్ణయ్య వారి మీదికి ఉరికాడు. ఆ మరు క్షణంలో ఆ రాక్షసుని హాహాకారాలు దూరంనుంచి విని పించినై. ]



## ★ 6. వ, రంగం ★

[ నరకాసురుడు ఒక అద్దం ముందు నుంచుని మీసం మెలి వేసుకుంటున్నాడు ; మురిసి పోతున్నాడు.

అంతలో కొందరు భటులు అక్కడికి వచ్చారు. ]

**భటులు :** ...ప్రభూ...ప్రభూ...!!

[ నరకాసురుడు వాళ్ల వేపు తిరిగి, 'ఏమిటి' అన్నట్టుగా చూశాడు. ]

ప్రభూ...! ఎవరో ఒక నల్లనయ్య వచ్చాడు. ్రాసురుణ్ణి ముక్కలు ముక్కలు చేశాడు. ఆయన కొడుకులను కూడా కూల్చేశాడు!

**నరకుడు :** ఆఁ...! నల్లనయ్యా ?

**భటులు :** ఔను ప్రభూ! ఆయనతో పాటు యెవరో ఒక అమ్మాయికూడా ఉంది!

**నరకుడు :** ...ఓ...!అయితే మనం చూడాలిసిందే!

[ ఆమాట అంటూనే నరకుడు వికటంగా నవ్వాడు. అలా నవ్వుతూనే అక్కడి నుంచి కదిలాడు. ]



# ★ 7. ప్రరంగం ★

[ ఒక కథకుడు ఆతరువాత జరిగిన గాథ చెబుతున్నాడు. ]

**కథకుడు :** ...ఆ విధంగా నరకాసురుడు బయటకు వెళ్ళాడు. వెళ్లి...

" బలవంతుండు ధరాసుతుండు గనె శుం
భద్రాజబింబోపరి
స్థల శంపాన్విత మేఘమోాయన ఖగేం
ద్రస్కంధ పీఠంబుపై
లలనా రత్నముగూడి సంగర కథా
లాపంబులం జేయు ను
జ్వలనీలాంగు గనన్నిషంగు గుహానా
చంగున్ రణాభంగునిక్ "

అంతలో సత్యభామ...

వేణిం జొల్లెము వెట్టి సంఘటిత నీ
వీ బంధయై భూషణ
శ్రేణిం దాల్చి ముఖేందు మండల మరీ
చీజాలముల్ పర్వగా
పాణిం బయ్యెద జక్కగా దురిమి శుం
భద్వీర్య సంరంభయై
యేణీలోచన లేచి నిల్చె దన ప్రా
ణేశాగ్ర భాగంబునన్ "

అలా నుంచున్న సత్యభామను చూసి, శ్రీకృష్ణుడు...

## ★ 8. వ్యరంగం ★

[ శ్రీకృష్ణుడూ సత్యభామా ముచ్చటించు కుంటున్నారు. నరకాసురుడు దూరంగా నుంచుని ఆమెవంక చూస్తున్నాడు.]

కృష్ణుడు : "లేమా దనుజుల గెలువగ
లేమా నీవేల కడగి లేచితి విటురా
లే, మాను, మానవే నా
లే, మా విల్లంది కొనుము లీలం గేలన్"

[ అంటూ శ్రీకృష్ణుడు సత్యభామకు వింటి నందించాడు. ఆమె దాన్ని అందుకుని, వింటి త్రాటిని కొంచెం లాగి వదిలింది. అప్పుడైన ధ్వని పెద్ద ఉరుము మాదిరి నలుదిక్కులా మారు మోగింది.

అది చూసిన నరకాసురుడు వికటాట్ట హాసం చేశాడు. ఆ వెంటనే సత్యభామ అతనిమీద బాణవర్షం కురిపించింది. ఆ బాణాల బాధను తట్టుకోలేక, నరకుడు అంతకంతకు వెనక్కు పోవటం మొదలు పెట్టాడు. ]

"కొమ్మా దానవనాథుని
కొమ్మాహావమునకు నోరగె గురువిజయము గై
కొమ్మా మెచ్చితి నిచ్చెద
గొమ్మాభరణములు నీవు గోరిన వెల్లన్ !"

[ సత్యభామ లజ్జ నభినయించింది. ఆ వెంటనే శ్రీకృష్ణుడు ఆమె చేతులో ఉన్న వింటిని అందుకున్నాడు. ]

నరకుడు: ( కృష్ణునితో )

" మగువ మగవారి ముందఱ
మగతనములు సూప రణము మానుట నీకున్
మగతనముగాదు దనుజులు
మగువలదెస జనరు మగల మగలగుట హరీ! "

కృష్ణుడు: ఓహోహో...ఎంతటి ప్రతాపం? ఊఁ...! ఐతే విను!

" నరకా ఖండించెద ను
త్కర కాండాసన విముక్త ఘనశరముల భీ
కరకాయు నిన్ను సుర కి
న్నరకాంతలు సూచి నేడు నందంబొందన్ "

[ అలా అంటూనే శ్రీకృష్ణుడు బాణాలు విసిరాడు. నరకుడు కూడా బాణాలు వేశాడు; కాని, సత్యభామ శ్రీకృష్ణుని మీదికి వచ్చే బాణాల నన్నింటినీ అడ్డుకుంటూ ఉంది.

అంతలోనే గరుత్మంతుడు నరకుని వేపుగా యెగిరి వెళ్లాడు. ఆ వెంటనే, నరకుని సైన్యంలో కల్లోలం ప్రారంభమయింది.

అంతలో శ్రీకృష్ణుడు తన చక్రాయుధాన్ని వదిలాడు. దాంతో నరకుడు భీకరంగా అరుస్తూ నేలమీదకు ఒరిగాడు.

ఆ వెంటనే భూదేవి నరకుని కుమారుడైన భగదత్తుని వెంట బెట్టుకుని అక్కడకు వచ్చింది. కృష్ణయ్యను సమీపించింది. ఆ కుఱ్ఱవాణ్ణి కృష్ణయ్య పాదాల మీద పడేసింది. ]

"దయ నిటు జూడుమా సరళ
        దైత్యుని బిడ్డడు వీడు నీ దెసగా
భయమున నున్నవాడు గదు
        బాలు డనన్య శరణ్యు డార్తు డా
శ్రయ రహితుండు తండ్రి క్రియ
        శౌర్యము నేరడు నీపదాంబుజ
ద్వయి బొడగాంచె భక్త పర
        తంత్ర సువీక్షణ దీనరక్షణా!"

[ కృష్ణయ్య మందహాసంచేస్తూ భగదత్తుని లేవనెత్తాడు; దగ్గరకు తీసుకున్నాడు. ఆ వెంటనే, సత్యభామ భూదేవిని ఆలింగనం చేసుకుంది. ]



# ★ 9. ప్రరంగం ★

[ నరకుని చెరనుంచి విడుదల అయిన రాజకన్యలు గుంపులు గుంపులుగా చేరి గుసగుసలు పోతున్నారు. అంతలో శ్రీకృష్ణుడూ సత్యభామా అక్కడకు వచ్చారు; వారిని చూసి మందహాసం చేశారు. ]

రాజకన్య: 1. ( మరొక కన్యతో )

" వనజాక్షి నే గన్కవై జయంతిక నైన
గదిసి వ్రేలుదు గదా కంఠమందు '

2. ( వేరొక కన్యతో )

' బింబోష్ఠి నే గన్క బీతాంబరము నైన
మెఱసి యుండుదుగదా మేనునిండ '

3. ( ఇంకొక కన్యతో )

' కన్నియనే గన్క గౌస్తుభమణి నైన
నొప్పు జూపుదుగదా యురమునందు '

4. ( ప్రక్కనున్న పిల్లతో )

' బాలిక నేగన్క బాంచజన్యము నైన
మొనసి జొక్కుదు గదా మోవి గ్రోలి '

5. ( తన స్నేహితురాలితో )

' పద్మగంధి నేను బర్హదామము నైన
జిత్రరుచుల నుందు శిరము నందు "

[ సత్యభామ వారి ముఖకవళికలనుబట్టి వారి అభిప్రాయాలు గ్రహించింది ; కృష్ణయ్య వంక చూసి చిరునవ్వు నవ్వింది. అది గమనించిన రాజకన్యలు సిగ్గుపడ్డారు. కొంచెంగా కిలకిల లాడారు. ]

కృష్ణుడు: ...సత్యా.... వీళ్ళందరినీ నీకు ఒప్పగిస్తున్నాను... ఏేం చేస్తావో?

సత్య: ( చిలిపిగా )

ఏమీ చెయ్యను; ఎలా ఉన్నవాళ్లను అలా తిరిగి మీకే ఒప్పగిస్తాను!

[ శ్రీకృష్ణ సత్యభామలూ రాజకన్యలూ ముసిముసి నవ్వులు నవ్వుతున్నారు.

శ్రీకృష్ణుడు అక్కడినుంచి కదలివెళ్లాడు. రాజకన్యలు తిరిగి ఒకరివంక ఒకరు చూసుకున్నారు. ]

రాజకన్యలు:

" పాపపు రక్కసుండు చెఱ
పట్టినటంచు దలంతు మెప్పుడున్
బాపుడుగాఁడు, వీనిగత
బద్మదళాక్షుని గంటి మమ్మ, ము
న్నీ పురుషోత్తముం గదియ
నేమి వ్రతమ్ములు నేసినారమో
యా పరమేష్ఠి పుణ్యుఁడు గ
దమ్మ హరిన్ మము గూర్చె నిచ్చటన్ "

సత్యభామ: ( మందహాసంతో )

... ఊఁ...పోదాం రండి!

[ సత్యభామ దారి తీసింది. రాజకన్యలు అనుసరించారు. ]



## ★ ముఖ్యపాత్రలు ★

1. శ్రీకృష్ణుడు
2. అదితి
3. సత్యభామ
4. శచి
5. ఇంద్రుడు



# పారిజాతాపహరణం

## ★ 1. ప్రరంగం ★

[ అది దేవేంద్రుని పురంలో అదితి మందిరం. ఆ మందిరం అంతా అప్పుడు మంగళ తూర్యనాదాలతో మారు మ్రోగుతూ ఉంది. అక్కడ యెవరి ముఖంలో చూసినా ఆనందమే తాండవిస్తోంది.

ధగధగ మెరిసే ఒక రత్నతల్పం మీద అదితి కూర్చుని ఉంది. ఆమె యెవరికోసమో యెదురు చూస్తున్నట్టుగా ఉంది.

అదితికి అటూ యిటూ దేవకన్యలు హారతి పళ్లేరాలు పట్టుకుని నుంచున్నారు. ఆమె ముందున్న పైడి పళ్లెంలో పారిజాత పుష్పాలతో గ్రుచ్చిన రెండు పెద్దమాల లున్నై.

దేవేంద్రుడు దారితీస్తుండగా, శ్రీకృష్ణుడు, సత్యభామతో అక్కడకు వచ్చాడు. శచీదేవి సత్యభామ ప్రక్కగా ఉంది. దారి పొడుగునా ఉన్న కన్యలు వారికి హారతులిచ్చారు.

శ్రీకృష్ణ సత్యభామలు సరాసరి అదితి వద్దకువెళ్లారు. ఆమె పాదాలకు నమస్కరించారు. ఆమె వారిని ఆశీర్వదించి, అత్యాదరంతో చెరో ప్రక్కనా కూర్చో పెట్టుకుంది.

దేవేంద్రుడు, అక్కడే ఉన్న పూలమాలలు ఒకటొకటే తీసి, అదితికి అందించాడు. ఆమె వాటిని శ్రీకృష్ణ సత్యభామల మెళ్లలో వేసింది. ]

**కృష్ణుడు:** పెద్దమ్మా! కులాసాగా ఉన్నావా ?

**అదితి:** ఓ...! నాకేం నాయనా? ప్రజాపతి భార్యని, పర మాత్ముని తల్లిని... నా కేం తక్కువ?

[ సత్యభామ, మందహాసంతో, కృష్ణునివంక చూసింది. ]

కాకపోతే, అప్పుడప్పుడు కష్టా లనేవి వస్తూ ఉంటై, పోతూ ఉంటై; దాని కే ముంది?

**సత్యభామ:**

ఏమిటి...? మీకు కూడా కష్టా లేనా?

**అదితి:** అయ్యో... అదేమిటమ్మా? కష్ట మన్నది మానవుల సొత్తే అనుకుంటున్నావా...? కాదు. అది అను భవించే హక్కు మాకూ ఉంది!

[ ఇంద్రుడు తల వంచుకున్నాడు. సత్యభామా కృష్ణయ్యా చిరునవ్వు నవ్వుకున్నారు. ]

**సత్యభామ:**

...అదీ ఓ అదృష్ట మే నంటారు!

**అదితి:** ఇంకా సందేహమా? అసలు కష్ట మనేది కళ్ల కే కనబడకపోతే సుఖంలో ఉండే సొంపు యెలా అర్థ మవుతుంది?

( కృష్ణయ్యతో )

...ఏమంటావు నాయనా?

**కృష్ణుడు:** ( చిరునవ్వుతో )

...అనుభవంమీద చెప్పినమాట అబద్ధమౌతుందా?

[ అది విన్న అదితీ సత్యభామా మందహాసం చేశారు. ]

...పెద్దమ్మా...! ఇవుగో...నీ కుండలాలు!

[ అంటూ కుండలాలు ఆమెకు అందించాడు. ]

**అదితి :** ( ఆనందంతో )
తెచ్చావు నాయనా...! తెచ్చావ్ !! మా నాయనకు నేనంటే యెంతో ప్రేమ!
( సత్యభామతో )
ఇవి ఆ నరకుని చేతులో పడ్డప్పటినుంచీ మేం పడుతున్న కష్టం యింతా అంతా కాదమ్మా !

[ కృష్ణయ్య ఆమెవంక సానుభూతితో చూశాడు. సత్యభామ యేదో ఆలోచిస్తూ శచీదేవి వంకచూస్తోంది. ]

**సత్యభామ:** అమ్మాయ్...ఇవి...

[ అంటూ మెళ్లో ఉన్న దండనుగురించి యేమో అడుగబోయింది. ]

**శచీదేవి:** పారిజాతాలక్కయ్యా ; మన దొడ్లోవే!

**సత్యభామ:** ఓ...అలాగా ? చాలా బాగున్నయ్యమ్మా !

**శచీదేవి:** అమరావతి అంతకూ ఒకేఒక చెట్టు ఉంది. అదీ మన తోటలోనే ఉంది!

[ సత్యభామ 'ఊఁ...!' అంటూ అదో విథంగా నిట్టూర్చింది. కృష్ణయ్య అది గ్రహించాడు. ]

**కృష్ణుడు:** ఏం ? మనసు వాటిమీాదికి పోయిందా...?

[ సత్యభామ ఔనన్నట్టుగా తల పంకించింది. ఇంద్రుడు సగర్వంగా శచీదేవి వంక చూశాడు. ]



# ★ 2. వ, రంగం ★

[ నందనోద్యాన వనంలో ఒకభాగం. అక్కడ, ఓ ప్రక్క, కోటి నక్షత్రాలు ప్రేలాడు తున్నట్లుగా ఉన్న ఒక చెట్టు కనిపించింది. శ్రీ కృష్ణుడు దానివద్దకు వెళ్లాడు. అటూ యిటూ చూశాడు. ఆ చుట్టు ప్రక్కల యెవరూ లేరని నిర్ణయించుకుని, దొంగ తనంగా, ఆ చెట్టును పెకలించ బోయినాడు.

కాని, ఆ చెట్టుకే, ఒక ప్రక్కగా ఆనుకుని, తోటమాలి గుఱ్ఱు కొడుతూ పడుకున్నాడు. ఆ చెట్టును పెకలించ బోతున్న సమయంలో కృష్ణయ్యకు అతను కనిపించాడు. అతణ్ణి చూసి కృష్ణయ్య చిలిపిగా నవ్వాడు.

మరుక్షణంలో, కృష్ణయ్య, ఆ చెట్టును సమూలంగా పెకలించాడు. దాంతో ఆ తోటమాలి దభీమని వెనక్కుపడ్డాడు. అదిచూసిన కృష్ణయ్య పకపకలాడాడు.

పడీపడటంతోటే, ఆ తోటమాలి, అటూ యిటూ చూసి, కొంపకూలి పోయినట్టుగా కేకలు పెడుతూ పరిగెత్తాడు. ]



## ★ 3 వ రంగం ★

[ అదితి మందిరం బయట, సత్యభామ, గరుడుని ప్రక్కగా నుంచుని ఉంది. అంతలో, శ్రీకృష్ణుడు, పారిజాత వృక్షంతో సహా, ఆమెను సమీపించాడు. ఆమె ముఖంలో అంతులేని ఆనందం వెల్లి విరిసింది.

అదే సమయానికి, దేవగణంతో సహా, తోటమాలి అక్కడకు వచ్చాడు.

శ్రీకృష్ణుడు వారినిచూసి చిరునవ్వు నవ్వాడు : చేతులో ఉన్న పారిజాత వృక్షాన్ని గరుడుని మీద ఉంచాడు. ]

**తోటమాలి :**

అడుగడుగో...పట్టుకోండి...పట్టుకోండి !

[ దేవత లందరూ శ్రీకృష్ణుని మీదకు ఉరికారు. సత్యభామ కలవర పడ్డది. శ్రీకృష్ణుడు కత్తి దూసి నుంచున్నాడు. అంతలో దేవేంద్రుడు గుర్రుమంటూ ప్రవేశించాడు. ]

**దేవేంద్రుడు:**

ఉఁహుఁ! పారిజాతాన్ని పట్టుకు పోవటం పాలకుండ లెత్తుకుపోవటం కాదు. ప్రాణాలతో బయటపడా లనుకుంటే పారిజాతాన్ని విడిచిపెట్టాలి. వింటు న్నావా ?

[ అలా అంటూ మీదికి వస్తున్న ఇంద్రుణ్ణి చూసి, సత్యభామ సిగ్గుపడ్డది ; కృష్ణుని వెనక్కు వెళ్లి నుంచుంది. ]

**కృష్ణుడు :** ఉఁహుఁ...ఎంత గర్వం ?

[ అంటూనే, కృష్ణయ్య దేవేంద్రునకు యెదురుగా వెళ్లాడు. అతణ్ణి చూస్తున్న దేవగణం అంతకంతకు వెనక్కు పోవటం మొదలు పెట్టింది. ]

ఆకాశవాణి :

... ఇంద్రా! మాయకు లోబడి మాధవుని దూషిస్తున్నావా? కళ్లు కప్పిన గర్వంతో కమలాక్షుని ప్రేమను కాలదన్నుకుంటున్నావా? ఆగు! ఆగు!! ఆయన పాదాలమీద పడు! పడి... చేసిన పాపానికి ప్రాయశ్చిత్తం చేసుకో!! ఆయన కోరిన పారిజాతాన్ని ఆయనకు స్వయంగా సమర్పించుకో! ఊఁ...! వెళ్లు...!!

[ అది విన్న ఇంద్రుడు నలువంకలా చూశాడు. అది ఆకాశవాణి అని నిర్ధారించుకున్నాడు. అమాంతంగా వెళ్లి శ్రీకృష్ణుని ముందు సాగిలపడ్డాడు. కృష్ణయ్య సత్యభామ వంక చూసి చిలిపిగా నవ్వాడు. ]

ఇంద్రుడు: ...నమోభగవతే వాసుదేవాయ!

"జగము రక్షింప జీవుల జంప మనుప
కర్తవై సర్వ మయుడవై కానిపింతు
వెచట నీమాయ దెలియంగ నెవ్వడోపు
విశ్వ సన్నుత విశ్వేశ వేదరూప!"

[ సత్యభామ సగర్వంగా మందహాసం చేసింది. కృష్ణయ్య, ఆదర పూర్వకంగా ఇంద్రుని లేవనెత్తాడు. ]



## ★ ముఖ్యపాత్రలు ★

1. శ్రీకృష్ణుడు
2. శివుడు
3. విష్ణువు



# కృష్ణవిజయం

## ★ 1. వ, రంగం ★

[ శంకరుడు ఆనందతాండవం చేస్తున్నాడు. అతని ప్రక్కన నుంచుని బాణుడు భక్త్యా మోఁయిస్తున్నాడు.

తాండవం పూర్తికాగానే, శంకరుడు కళ్లు తెరిచాడు; తన యెదుట ఉన్న బాణుని చూశాడు. ]

**బాణుడు:**

" శంకర భక్తమా సవ
శంకర దుష్టమదాసురేంద్ర నా
శంకర పాండునీల రుచి
శంకర వర్ణ నిభాంగ భోగిరా
ట్కంకణ పార్వతీ హృదయ
కైరవ కైరవ మిత్ర యోగి హృ
త్పంకజ పంకజాప్త జయ
తాండవ ఖేలన భక్త పాలనా "

**శివుడు:** బాణా!... ఏం యిలా వచ్చావ్?

**బాణుడు:** ఏముంది స్వామీ! ఎప్పుడు వచ్చినా తమ దయ కోసమే!

**శివుడు:** బలిచక్రవర్తి కుమారునికి, శోణపురాధీశ్వరునికి, మా దయ కావలసి వచ్చిందా?

**బాణుడు:** అయ్యయ్యో... యెంతమాట? శివుని ఆజ్ఞ లేక పోతే చివురుటాకైనా కదలదు! ఇక, బాణుడెంత... వాని బ్రతుకెంత?

**శివుడు:** ( మందహాసంతో )
ఊఁ ! ఇంతకూ నీ కోరిక ...

**బాణుడు:** చాలా స్వల్పమైనదే స్వామీ ! చెల్లిస్తానని మీరు సెల విస్తే శీఘ్రంగా మనవి చేసుకుంటాను !

**శివుడు:** ఊఁ ... కానీ !

**బాణుడు:** మహేశ్వరా ...! బాణుడు మీ అనుగ్రహానికి పాత్రుడైనాడు. అతణ్ణి మీరు అన్ని విధాలా కాపాడుతూనే ఉన్నారు. కాని,

[ 'మరి లేని దేమిటి ?' అన్నట్టుగా శివుడు అతని వంక చూశాడు. ]

అతనొక చోటా మీరొక చోటా అయిపోయి నారు. అదే అతను భరించలేకుండా ఉన్నాడు !

**శివుడు:** ( చిరునవ్వుతో )
... ఊఁ ... అందుకని ... ?

**బాణుడు:** ... ఏమీ లేదు ...! ఆది దంపతులైన మీరు, అహర్నిశలూ అతని కళ్లముందు ఉండాలని అతను కోరుతున్నాడు ! మీరు స్వయంగా అతని దుర్గరక్షణ భారాన్ని వహించాలని అతను అభిలషిస్తున్నాడు ! అంతే !

**శివుడు:** ( కొంచెంగా కలవరపడి )
... ఓ ...! అలాగే !

**బాణుడు:** ... మహాప్రసాదం !

[ బాణుడు శంకరునకు నమస్కరించాడు. శంకరుడు మందహాసం చేశాడు. ]



## ★ 2. వ, రంగం ★

[ గౌరీ సమేతుడైన శంకరుడు శోణపురంకోటకు కాపలా కాస్తున్నాడు. భూతగణమంతా ఆయనను పరివేష్టించి ఉంది.

అంతలో, బాణుడు అక్కడకు వచ్చాడు. వచ్చి, సరాసరి పార్వతీ పరమేశ్వరులవద్దకు వెళ్లాడు. ఆ దంపతులు చిరునవ్వుతో అతనికి స్వాగతం చెప్పారు.

బాణుడు శంకరుని పాదాలమీద వ్రాలాడు. శంకరుడు అతణ్ణి లేవనెత్తాడు. ]

బాణుడు: పార్వతీ పతయేనమః!

[ అంటూ బాణుడు నిట్టూర్చాడు.
అది గమనించిన శంకరుడు 'ఏమిటి' యీ విచారం? అన్నట్టుగా అతని వంక చూశాడు. ]

... పరమేశ్వరుని పరమ భక్తుడు కూడా, తీరని కోరికతో తపించవలసిందేనా స్వామీ?

శివుడు: ... అదేమిటి?

బాణుడు: ... ఏముంది?

"అనిలో నన్ను నెదిర్చి బాహు బల శౌ
ర్య స్ఫూర్తి బోరాడ జా
లిన వీరుం డొకడైన బందెమునకున్
లే డయ్యె భూమండలి
న్నన యంబున్ భవదీయ దత్త కర సా
హస్రంబు కండూతి వా
యు నుపాయంబును లేద యీభరము నె
ట్లోర్తు న్నుమా నాయకా"

**శివుడు:** ( మందహాసంతో )

... బాణా ...! ఏమిటి యీ విపరీతపు కోరిక?

**బాణుడు:** స్వామీ ఇది మీకు విపరీతంగా కనబడవచ్చు; కాని, యిది నాలో ఉన్న తీరని కోరిక. ఆరని మంట. ఇది తమరు గ్రహిస్తే నన్ను తప్పకుండా అనుగ్రహిస్తారు!

**శివుడు:** ( కొంచెం చిరాకుపడి )

ఊఁ ...! అయితే సరే ...!

" విను మూఢ హృదయ నీకే
తన మెప్పు డకారణంబ ధారుణిపై గూ
లును నప్పుడ నీ భుజావలి
తునియగ నాయంత వానితో నని గల్గున్ "

**బాణుడు:** ... మహాప్రసాదం!

[ అంటూ అతను తిరిగి శంకరుని పాదాలమీద వ్రాలాడు. ]



# ★ 3. వ్ర రంగం ★

[ కథకుడు ఆ తరువాత జరిగిన గాథ చెబుతున్నాడు. ]

కథకుడు: ఆ రోజు నుంచీ, తన జండా, యెప్పుడు వాలుతుందా అనీ, తన కోరిక యెప్పుడు తీరుతుందా అనీ బాణుడు నిమిషాలు లెక్కపెడుతూ ఉన్నాడు.

అలా ఉండగా, అతని కూతురైన ఉషా కన్య ఒక రోజున ఒక కలగన్నది. అందులో, ప్రద్యుమ్నుని కుమారుడైన అనిరుద్ధుడు ఆమెకు కనిపించాడు. అంతే. ఆమె మనసు అతని మీద లగ్నమయింది. అతనే తనకు భర్త కావాలని ఆమె నిర్ణయించుకుంది.

ఉషాకన్యకు బాల్యసఖి అయిన చిత్రరేఖ ఆ రహస్యాన్ని గ్రహించింది. గ్రహించటమే కాదు ; తన యోగబలం ద్వారా ఆ అనిరుద్ధుణ్ణి అమాంతంగా యెత్తుకు వచ్చి ఉషా కన్యకు ఒప్పగించింది. ఆ రోజునుంచీ ఉషానిరుద్ధులు శోణపుర రాజ మందిరంలో అతిసంతోషంతో కాలం గడుపసాగారు.

ఆ విషయం అలా అలా బాణునకు తెలిసింది. అతనికి అంతులేని ఆగ్రహం కలిగింది. ఆ వెంటనే అతను ఉషాకన్య మందిరానికి వెళ్లాడు. వెళ్లి, అనిరుద్ధుని బంధించటానికి యెంతగానో ప్రయత్నించాడు. కాని, అనిరుద్ధుని బలం ముందు అతని బలం యెందుకూ పనికి రాకుండా పోయింది. అందుకనే అతను అనిరుద్ధునిమీద నాగపాశాన్ని ప్రయో

గించాడు. అతణ్ణి బంధించాడు. చెరసాలలో పడేశాడు.

ఇక్కడ యిలా ఉండగా, అక్కడ ద్వారకా నగరంలో యాదవు లందరూ అనిరుద్ధునిగూర్చి అనేక విధాల అనుకోవటం మొదలు పెట్టారు. అతను అదృశ్యుడు కావటం అందరికీ ఆశ్చర్యాన్నీ ఆవేద ననూ కలిగించింది.

అంతలో, ఓనాడు, నారదుడు అక్కడికి వెళ్ళాడు. వెళ్ళి, శ్రీకృష్ణ బలరాములను కలుసుకున్నాడు.

బలరామ కృష్ణులూ నారద మహర్షీ అనేక విషయాలను గురించి మాట్లాడుకున్నారు. ఆ సంద ర్భంలోనే అనిరుద్ధుని ప్రసక్తి కూడా వచ్చింది. అప్పుడు, నారదుడు, ఉష అనిరుద్ధుని ప్రేమించటమూ, ఆమె స్నేహితురాలు, హాయిగా యింట్లో పడుకుని ఉన్న అనిరుద్ధుణ్ణి అపహరించుకుపోయి ఆమెకు ఒప్ప చెప్పటమూ, అది సహించలేని బాణాసురుడు అని రుద్ధునితో యుద్ధంచేసి, అతి కష్టంమీద, అతణ్ణి బంధించి కారాగారంలో ఉంచటమూ మొదలైన విషయా లన్నీ పూసగ్రుచ్చినట్టుగా వారికి వివరించి చెప్పాడు.

అది విన్న బలరామ కృష్ణుల ఆగ్రహానికి అంతు లేక పోయింది. ఆ వెంటనే, వారు, పన్నెండు అక్షౌహిణుల సైన్యంతో శోణపురం మీదకు దం డెత్తి వెళ్ళారు.

రామకృష్ణుల రాకను గ్రహించిన బాణాసురుడు తన సైన్యాల నన్నింటినీ సమకూర్చుకుని, వారిని యెదరించటానికి బయలుదేరాడు. అతనితో పాటు శివుడూ యముడూ కూడా వెళ్లారు.

యుద్ధం ప్రారంభమయింది. శంకరుడు శ్రీకృష్ణునితో తల పడ్డాడు. బలరాముడు బాణుని మీద కలియబడ్డాడు.

బాణునకూ, బలరామ కృష్ణులకూ మధ్య, బ్రహ్మాండమైన పోరాటం జరిగింది. ఆ సందర్భంలో నేల, నలువంకలా, నెత్తురు నదిగా మారిపోయింది. అప్పుడు ...



# ★ 4. వ్యంగం ★

[ యుద్ధరంగంలో శ్రీ కృష్ణుడూ బాణుడూ నిలబడి ఉన్నారు. లోపలినుంచి కలకలం అమితంగా వినిపిస్తోంది.

శ్రీ కృష్ణుడు విల్లు యెక్కు పెట్టి బాణం వదల బోతు న్నాడు. అప్పటికే సగం చచ్చిన బాణుడు, చేసేదిలేక, దాని బారినుంచి యెలా తప్పుకోవటమా అని ఆలోచించ సాగాడు.

అంతలో బాణుని తల్లి 'కోటర' అక్కడకు వచ్చింది. వస్తూనే ఘోరంగా ఉరిమింది. ఆ వెంటనే శ్రీ కృష్ణునకూ బాణునకూ మధ్యగా నుంచుంది.

కోటరను చూడగానే కృష్ణునకు చాలా అసహ్యం వేసింది ఆయన దానివంక చూడలేక పోయినాడు. ఎక్కుపెట్టిన విల్లును దించేసి, కళ్లు మూసుకున్నాడు.

ఆ సమయం కనిపెట్టి, కోటర, పారిపోవలసిందిగా తన కుమారునికి సైగ చేసింది. అది గ్రహించిన బాణుడు, వెంటనే కాలికి బుద్ధిచెప్పాడు. 'బ్రతుకు జీవుడా' అనుకున్నాడు.

కృష్ణుని వెనుక ఉన్న యాదవు లందరూ, పారిపోతున్న బాణుని చూశారు. చూసి, పగలబడి నవ్వారు.

అంతలోనే శంకరుడు అక్కడకు వచ్చాడు. వచ్చీ రావటంతోటే, ఒక పెద్ద దయ్యం మాదిరి ఉండే శైవ జ్వరాన్ని కృష్ణునిమీదకు పంపించాడు.

అది గ్రహించిన కృష్ణయ్య తన వేపునుంచి ఒక అద్భుత మైన వైష్ణవ జ్వరాన్ని వదిలాడు. అది కోటిసూర్యుల కాంతితో ప్రకాశిస్తూ శైవజ్వరంమీదకు ఉరికింది. మరు క్షణంలో ఆ రెంటికీ ఘోరమైన పోరాటం ప్రారంభమయింది. ఆ పోరాటంలో శైవజ్వరం పారిపోయింది; వైష్ణవజ్వరం ఆమెను తరుముకుంటూ వెళ్లింది.

అదిచూసి, శ్రీకృష్ణుడూ, యాదవులూ కడుపుబ్బ నవ్వు కున్నారు. ]



# ★ 5. వ, రంగం ★

[ లక్ష్మీసమేతుడైన శ్రీమన్నారాయణుడు ఒక ప్రక్క నుంచుని పోరాటం చూస్తున్నాడు. అతని ప్రక్కన బ్రహ్మాదులు కూడా ఉన్నారు.

ప్రాణభీతితో పరిగెత్తుకు పోయిన శైవజ్వరం అక్కడకు వచ్చింది. వచ్చి, అమాంతంగా శ్రీహరి పాదాలమీద పడ్డది.]

**శైవజ్వరం:**

పరమ పితా ! శరణు .. శరణు !!

**శ్రీహరి:** ( ఏమీ తెలియనట్టుగా )

అరెరె! ఏమిటమ్మా యిది ?

**శైవజ్వరం:**

( లేచి అతని కెదురుగానుంచుని )

... పరమేశ్వరా !

" శాంతమై మహిత తీక్ష్ణ దుస్సహంబై యు
దారమై వెలుగొందు తావకీన
భూరిభాస్వత్తేజమున దాపమొందితి
గడు గృశించితి నన్ను గరుణ జూడు
మితర దేవోపాస్తి రతిమాని నీపాద
కమలముల్ సేవించు విమలబుద్ధి
యెందాక మదిదోప దందాక నే కదా
ప్రాణులు మిగుల తాపముల బడుట

యవిరళానన్య గతికుల నరసి బ్రోచు
బిరుదుగల నీకు నను గాచు టరుదె దేవ
ప్రవిమలాకార సంసారభయ విదూర
భక్తజనపోష పరితోష పరమ పురుష !"

బ్రహ్మ: ( మందహాసం చేస్తూ )

ఊఁ! ఇప్పటికైనా తెలుసుకున్నావ్ ; అంతే చాలు !

[ శైవజ్వరం తిరిగి శ్రీహరికి సాష్టాంగ పడ్డది. ]

శ్రీహరి: ( ఆమెను లేవదీస్తూ )

... లే ! వెళ్లు ! ఇక నీకేం భయంలేదు !

[ అంతలో, పాంచజన్యం పూరించిన ధ్వని అయింది. శ్రీహరి అటుగా చూశాడు. ]



## ★ 6. వ, రంగం ★

[ శ్రీ కృష్ణుడు పాంచజన్యం ఊదుతున్నాడు. అంతలో అతనిమీద బాణవర్షం కురిసింది. ఆ వెంటనే, బాణుడు,అతని యెదుటికి వచ్చాడు. వచ్చి, వికటాట్టహాసం చేశాడు.

అదిచూసిన శ్రీకృష్ణుడు, వెంటనే సుదర్శన చక్రాన్ని అతనిమీదికి పంపాడు. అది చూసిన బాణుడు భయపడి పోయినాడు. దారీ తెన్నూ తోచక తికమక పడసాగాడు.

అంతలో శంకరుడు అక్కడకు వచ్చాడు. వచ్చి, శ్రీ కృష్ణుని ముందు నిలబడి, చేతులు జోడించాడు. ]

**శివుడు:** ... పురాణ పురుషా!

"అవ్యయుండ వనంతుండ వచ్యుతుండ
వాది మధ్యాంత శూన్యుండ వఖిల ధృతివి
నిఖిలమందెల్ల వర్తింతు నీవు దగిలి
నిఖిల మెల్లను నీయంద నెగడు గృష్ణ!"

**శ్రీకృష్ణుడు :**

( మందహాసం చేస్తూ )

... శంకరా! ఏమిటిదంతా ?

**శివుడు:** పురాణ పురుషా! ఏమని మనవి చేసుకునేది? బాణుడు నా భక్తుడు. అతనికి నేను అభయ ప్రదానం చేశాను.

**శ్రీకృష్ణుడు:**

ఇప్పుడు అతనికి వచ్చిన ఆపద మాత్రం యేముంది? అతని గర్వాన్ని హరించటమే నాపని. అంతే! అతణ్ణి సంహరించటం నా ఉద్దేశం కానే కాదు!

[ శంకరుడు నివ్వెరబోయి నిలబడ్డాడు. ]

... అతడు ప్రహ్లాదుని మనుమడు కావటమే దానికి మూలం.

'నీ వంశీకుల నెవరినీ నేను చంపను' అని ప్రహ్లాదునకు నేను మాట యిచ్చాను. అది నువ్వు మరచిపోయినట్టున్నావు!

[ శంకరుడు, తలవంచుకునే, తిరిగి శ్రీహరికి నమస్కరించాడు. అంతలో బాణాసురుడు పరుగుపరుగున వచ్చి శ్రీకృష్ణుని పాదాలమీద వ్రాలాడు. ]

బాణుడు: కృష్ణా! ఆర్తత్రాణ పరాయణా! రక్షమాం! రక్షమాం!!

[ శ్రీకృష్ణుడు బాణుని లేవనెత్తాడు; కౌగిలించుకున్నాడు. అంతలో ప్రద్యుమ్నుడు అక్కడకు వచ్చాడు. బాణాసురుడు వెంటనే అతణ్ణి ఆలింగనం చేసుకున్నాడు. ]

మహానుభావా! నన్ను క్షమించు! నా తప్పులు మన్నించు! మా ఉషాసుందరిని కోడలుగా స్వీకరించు!

[ అలా అని బాణుడు ప్రార్థేయపడ్డాడు. ప్రద్యుమ్నుడు శ్రీ కృష్ణుని వంక చూశాడు. శ్రీకృష్ణుడు మందహాసంతో 'సరే ... కానీ' అన్నట్టుగా చూశాడు. ప్రద్యుమ్నుడు, ఆదరంతో, బాణుని దగ్గరకు తీసుకున్నాడు: హృదయానికి హత్తుకున్నాడు. బాణుడు సంతోషంలో ఉప్పొంగి పోయినాడు. ]



## ★ ముఖ్యపాత్రలు ★

1. పౌండ్రకుడు
2. శ్రీకృష్ణుడు
3. బలరాముడు



# పౌండ్రక సంహారం

## ★ 1. వ్ రంగం ★

[ పౌండ్రక వాసుదేవుడూ అతని స్నేహితుడు కాశీ రాజూ ముచ్చటించుకుంటున్నారు. ]

**పౌండ్రకుడు:**

ఉఁహుఁ! పరువూ ప్రతిష్టా కోరే వాళ్లు యెవరూ కూడా యింత నీచంగా ప్రవర్తించరు!

**కాశీరాజు:** ఇంతకూ...యిప్పుడేమయింది?

**పౌండ్రకుడు:**

వసుదేవుని కొడుకు ఓ నల్లనయ్య ఉన్నాడు ... తెలుసుగా!

**కాశీరాజు:** ఆఁ ఆఁ...ఏం చేశా డేమిటి?

**పౌండ్రకుడు :**

( వికటంగా నవ్వి )

ఏం చేస్తాడు? ఏదైనా ఘనకార్యం చేయాలీ అంటే దానికి తగ్గ శక్తి ఉండాలి. అతనిలో అది మొదటి నుంచీ పూజ్యమే. అందుకని, యిప్పుడు అత నొక విచిత్రమైన మోసానికి దిగాడు.

**కాశీరాజు:** అతని విషయంలో అ దేమీ క్రొత్తకాదే! మోసం పుట్టి అతను పుట్టాడు. మోసంతోనే అతను బ్రతుకు తున్నాడు.

**పౌండ్రకుడు:**

ఔనౌను. అందులో రహస్య మేమీ లేదు. అందరికీ తెలిసిన విషయమే. కాని, అతని చేష్టలిప్పు డిప్పుడు హద్దుమీరి పోతున్నై.

[ 'అదేమిటి ?' అన్నట్టుగా కాశీరాజు అతనివంక చూశాడు. ]

...ఇంతవరకు అతను యేం చేసినా, మనం, చూసీ చూడనట్టు పోతున్నాం. అది అతనికి అలుసిచ్చిన ట్టయింది. ఇప్పు డతను మన పేరు పెట్టుకున్నాడు. మన మాదిరిగానే మకరకుండలాలూ మణి పద కాదులూ ధరించాడు. అచ్చంగా మన మల్లేనే తయారైనాడు. ఈ వేషంలో, మందనే కాకుండా మానవలోకాన్నంతనీ మోసం చేయటానికి పూను కున్నా డన్నమాట! మన గౌరవాన్ని అపహరించ టానికి ప్రయత్నిస్తున్నా డన్నమాట!

**కాశీరాజు:**

ఊఁహుఁ...! పులిని చూసి నక్క వాతలు పెట్టుకుం దిట. అలా ఉంది అతని కథ!

**పౌండ్రకుడు:**

( వికటంగా నవ్వి )

అందుకనే ఆ కథను కంచికి పంపటానికి మనం నిశ్చయించుకున్నాం!

[ అది విన్న కాశీరాజు మందహాసం చేశాడు. ]



## ★ 2. వ్రంగం ★

[ అది ద్వారకా నగరంలో కృష్ణబలరాముల కొలువు. ప్రముఖులైన గోపాలురు ఆ సభలో ఉచితాసనాలమీద ఉపవిష్టులై ఉన్నారు.

అంతలో పౌండ్రకుడు పంపిన దూత ప్రవేశించాడు; వారికి నమస్కరించాడు. బలరాముడు అతనికి ఉచితాసనం చూపించాడు. ]

**బలరాముడు:**

పౌండ్రక వాసుదేవులు క్షేమంగా ఉన్నారా?

**దూత:** చిత్తం!

**బలరాముడు:**

ఇంకా...అక్కడి విశేషాలేమిటి?

**దూత:** విశేషాలేమీ లేవు. కాకపోతే, మా మహారాజు మీ నాయకునికి ఒక సందేశం పంపారు.

[ బలరాముడు ఆమాట విని కొంచెం బాధపడ్డాడు. ]

**కృష్ణయ్య:** బాధపడటం దేనికి? ఆయన దృష్టిలో మనం రాజులమూ కాదు; మన దొంక రాజ్యమూ కాదు. మనం గొల్లల నాయకులం; అంతే!

**దూత:** ఆc...! ఆ విషయాన్నే మీకు గుర్తుచెయ్యమన్నారు! ఆ సందర్భంలోనే...

"నా పేరును నా చిహ్నము
లేపున ధరియించి తిరిగెదిది పంతమె యిం

తే పోమది బరికించిన
నే పంతమెలుంగు గొల్ల డేమిట నయినన్ ''
అని కూడా అన్నారు.

కృష్ణయ్య: ( పొంగులువారే కోపాన్ని అణచుకుంటూ )
ఊఁ! వారి సందేశం యిదేనా, యింకేదైనా ఉందా ?

దూత: ...వారు నాకు సెలవిచ్చిన విషయం...

" ఇంతనుండియైన నెదిరి దన్నెఱిగి నా
చిన్నెలెల్ల విడిచి చేరి కొలిచి
బ్రతుకు మనుము కాక పంతంబు లాడెనా
రొదురు మనుము ఘోర కదనమునకు " అని.

[ ఆ మాటలు విన్న బలరాముడు హుంకరించాడు. గోపాలు రందరూ ఆ దూతవంక చురచురా చూశారు; అతనిమీదపడి చీల్చి చెండాడే ప్రయత్నంలో ఉన్నారు. అది గ్రహించిన శ్రీకృష్ణుడు మందహాసం చేస్తూ, శాంతంగా ఉండండని వారికి సైగ చేశాడు. ఆ వెంటనే బలరాముని వంక చూశాడు. చూసి...]

కృష్ణయ్య:
అన్నా! ఆయన దూతగా వచ్చాడు. తన మహా రాజు మనసును మనకు తెలియపరచుకుంటున్నాడు. ఇందులో యితని వ్యక్తిత్వ మేముంది; యితనిమీద మనం కోపగించుకోవలసిన అవసర మేముంది ?

( దూతతో )

" వినరా! మీ నృపు డన్న చిహ్నములు నే
వే వచ్చి ఘోరాజిలో
దనమీదన్ వెసవైవ గంకముఖ గృ
ధ్రవ్రాతముల్ మూగగా
ననిలో దర్పము దూలి కూలి వికలం
బై సారమే యాలికి
న్ననయంబున్ శరణంబ వయ్యెదను మే
నన్నట్టుగా వానితోన్ "

దూత : (కొంచెం బాధతో)

సెలవు తీసుకుంటాను!

[ ఆమాట అంటూనే అతను గిఱ్ఱున వెనక్కు తిరిగాడు. గోపాలురు అతని వంక చూస్తూ విరగబడి నవ్వారు. ]



# ★ 3. ప్రరంగం ★

[ కథకుడు ఆ తరువాత జరిగిన గాథ చెబుతున్నాడు. ]

**కథకుడు :** ...ఆ దూత శ్రీ కృష్ణుని సమాధానాన్ని పౌండ్రకునకు అందజేశాడు. అదివిన్న పౌండ్రకుడు తోక త్రొక్కిన త్రాచుమాదిరి బుసలు కొట్టాడు.

అది జరిగిన కొద్ది రోజులకే శ్రీ కృష్ణుడు యుద్ధానికి సన్నద్ధుడై కాశీపురం చేరుకున్నాడు. పౌండ్రకుడు, తన స్నేహితుడైన కాశీరాజుతో సహా, అయిదు అక్షౌహిణుల సైన్యంతో అతని నెదుర్కొన్నాడు. అక్కడ, యుద్ధరంగంలో...

"చక్రగదాశంఖ శార్ఙ్గాది సాధను
　　కృత్రిమ కౌస్తుభ శ్రీ విలాసు
మకర కుండల హార మంజీర కంకణ
　　మణిముద్రికా వన మాలికాంకు
దరళ విచిత్ర పతంగ పుంగవకేతు
　　జెలువొందు పీత కౌశేయ వాసు
జవనాశ్వకలిత కాంచన రథారూఢుని
　　రణకుతూహలు లసన్మణి కిరీటు
నాత్మసమవేషు రంగవిహార కలిత
నటసమానుని బౌండ్ర భూనాథుగాంచి
హర్షమిగు రొత్త నవ్వె బద్ధాయతాత్తు
డంత వాడును సుద్వృత్తు డగుచు నడరి"

" పరిఘ శరాసన పట్టిస
శర ముద్గర ముసల కుంత చక్ర గదా తో
మర భిండివాల శక్తి
క్షురికాసి ప్రాస పరశు శూలములవెసన్ "

" పరువడి వైచినన్ దనుజ
భంజను డంత యుగాంతకాల భీ
కర మహితోగ్ర పావకుని
కైవడి నేచి విరోధిసాధనో
త్కరముల నొక్కటన్ శరని
కాయములన్ నిగిడించి త్రుంచి భా
స్వరగతి నొత్తె సంచలిత
శాత్రవ సైన్యము పాంచజన్యమున్"

" వారని యల్కతో గినిసి
వారిజనాభుడు వారి సైన్యముల్
మారిమసంగినట్టు నుఱు
మాడిన బీనుగు పెంటలై వెసం
దేరులు వ్రాలె నశ్వములు
ద్రెళ్లె గజంబులు మ్రొగ్గె సద్భటుల్
ధారుణి గూలి రిట్లు నెఱి
దప్పి చనెన్ హతశేష సైన్యముల్ "

రణరంగ మంతా అలా భీభత్సంగా తయారయింది.
అప్పుడు, శ్రీకృష్ణుడు పౌండ్రకుని చూసి...



## ★ 4. వ్రరంగం ★

[ శ్రీకృష్ణుడూ పౌండ్రకుడూ పోరాటానికి సిద్ధంగా నుంచున్నారు. శ్రీ కృష్ణుడు పౌండ్రకుని ఉద్దేశించి...]

కృష్ణుడు: " మనుజేంద్రాధమ పౌండ్ర భూపసుత నీ
మానంబు బీరంబు నే
డనిలో మాపుదు నెద్దు క్రొవ్వి పెలుచ
న్నాబోతుపై ఱంకె వై
చిన చందంబున దూత చేత నను నా
క్షేపించి వల్దన్న పే
రును జిహ్వాంబులు నీ పయిన్ విడుతు న
ర్చుల్ పర్వ నే డాజిలోన్ "

[ అంటూనే విల్లెక్కుపెట్టి బాణం వదిలాడు. పౌండ్రకుడు కూడా బాణాలు విసిరాడు. కొంతసేపటికి పౌండ్రకుడు తిరోగమించటమూ శ్రీకృష్ణుడు పురోగమించటమూ జరిగింది.

అంతలో శ్రీకృష్ణుని శరం ఒకటి పౌండ్రకుని గుండె దూసుకుపోయింది. దాంతో ఆతను భీకరంగా అరుస్తూ నేల కొరిగాడు. శ్రీకృష్ణుడు విజయసూచకంగా మందహాసం చేశాడు. అంతలో ఆయనమీద పుష్పవర్షం కురిసింది. అప్పుడు ' శ్రీకృష్ణపరమాత్మకూ... జై ' అన్న నినాదాలు దశదిశలనుంచీ వినవచ్చినై.

అంతలో, పౌండ్రకునిలో నుంచి ఒక వెలుగు బయలుదేరి శ్రీకృష్ణుని సమీపించింది; ఆయనలో లీనమై పోయింది. ]



# ★ ముఖ్యపాత్రలు ★

1. జరాసంధుడు
2. శ్రీ కృష్ణుడు
3. ధర్మరాజు
4. భీముడు
5. అర్జునుడు
6. నకులుడు
7. సహదేవుడు
8. కుంతి
9. శిశుపాలుడు



# జరాసంధవధ

## ★ 1. ప్రరంగం ★

[ ఒక కథకుడు జరాసంధుని వధకు సంబంధించిన గాథను చెబుతున్నాడు. ]

కథకుడు: ...శ్రీకృష్ణుడు, తన అల్లుడైన కంసుని అన్యాయంగా వధించాడన్న అభిప్రాయం, మగధరాజైన జరాసంధునిలో వ్రేళ్లు పాతుకుపోయింది. ఏ విధంగా అయినా సరే శ్రీ కృష్ణుని హతమార్చాలనీ, అతడు అండగా బ్రతుకుతున్న యాదవవంశాన్ని సమూలంగా నాశనం చెయ్యాలనీ అతను నిశ్చయించుకున్నాడు. అందుకనే, అతను ఇరవైమూడు అక్షౌహిణుల బలంతో మధురమీదికి దండెత్తివెళ్లి శ్రీకృష్ణుని చికాకుపరిచాడు.

జరాసంధుని మూలంగా రాజన్యలోకమంతా బాధపడుతోందని శ్రీ కృష్ణునకు తెలుసు. ఒక సమయంలో...

"ఏ నవతరించు టెల్లను
మానుగ జతురంత ధరణీ మండల భరమున్
మానుపుకొఱకుం గాదే
పూనెద నిది మొదలు దగిలి భూభరముడుపన్"

అని కూడా అనుకున్నాడు. అయినా...

"మగధ నాథు బోర మడియింపబోలదు
మడియకున్న వీడు మరలి మరలి
బలముగూర్చు కొనుచు బఱతెంచు బఱతేర
ద్రుంపవచ్చు నేల దొసగు దొలఁగ"

అనే అభిప్రాయం ఆయనకు కలిగింది.

అదే సమయంలో, ఆకాశంనుంచి రెండురథాలు దిగివచ్చినై. వాటినిండా అనేకరకాలయిన ఆయుధాలున్నై. అది చూసిన శ్రీకృష్ణుడు, బలరామునితో...

"కంటే రామ ! రథంబు లాయుధములున్
గాఢ ప్రకాశంబులై
మింటన్ వచ్చెను వీనిగైకొని సురల్
మెచ్చన్ నృపశ్రేణులన్
బంటింపం బనిలేదు చంపుము ధరా
భారంబు వారింపు మిః
వెంటఁ నీయవతారమున్ సఫలమౌ
వేవేగ లె మ్మాజికిన్" అన్నాడు.

ఆ వెంటనే...

"ఖరులై దృఢకవచధను
శ్శరులై యధిగత రథానుచరులై మదవ
త్కరులై ఘనహరులై బల
హరులయ్యొడ నాజి కేగి రతి భీకరులై"

ఆ విధంగా యుద్ధరంగంలో ప్రవేశించి, బలరామకృష్ణులు, జరాసంధుని సైన్యాన్ని చిందరవందర చేశారు. అప్పుడు...

" చెడు రథములు దెగు హరులును
బడుకరులును మడియుభటులు బఱచు రుధిరమున్
మడియు తల లొఱగు తనువులు
పొడియగు తొడవులును మధురిపుని దెసగలిగెన్ "

ఆ పరిస్థితిలో ఉన్నప్పటికీ జరాసంధుని పక్షాన ఉన్న వారు...

" ఈ కాయంబుల బాసినంతటనె మా
కెగ్గేమి జేతృత్వమున్
నీకుం జెల్లదు కృష్ణ నిర్జరులమై
నిన్నోర్తు మా మీఁదటన్
వైకుంఠంబున నంచు బల్కు క్రియ దు
ర్వారాస్త్ర భిన్నాంగులై
యాకంపింపగ కొంద ఱాడుదురు గ
ర్వాలాపముల్ కృష్ణునిన్ "

ఆ సమయంలో జరాసంధుడు శ్రీకృష్ణునికి పట్టు పడ్డాడు. పట్టుపడ్డాడుగదా అని శ్రీకృష్ణుడు అతణ్ణి సంహారించలేదు. సంహారించక పోవటమే కాదు...

" దుఃఖింపం బనిలేదు పొమ్ము బలసం
దోహంబులం దెమ్ము చే
తఃఖేదం బెడలంగ రమ్ము రిపులం
దండింపు కాదేని భా
స్వఃఖేలజ్జన మెల్ల మెచ్చ నృప నీ
శౌర్యోన్నతుల్ జూపి మే
దఃఖండంబులు భూతముల్ దిన దను
త్యాగంబు సేయం దగున్ "

అని చెప్పి విడిచి పెట్టాడు కూడా.

అలా యిల్లుచేరిన జరాసంధుడు ఆ తరువాత చాలా సార్లు శ్రీకృష్ణుని మీదకు దండెత్తి వచ్చాడు; కాని, అన్ని సార్లూ అతను ఓడి పోవటమే జరిగింది.

కాలయవనుని మరణానంతరం, శ్రీకృష్ణ బలరాములు, మధురానగరం నుంచి ద్వారకకు తమ ధనాగారాలను చేరవేస్తున్న సమయంలో, తిరిగి జరాసంధుడు వారిమీద దండెత్తి వచ్చాడు. శ్రీకృష్ణ బలరాములు అతనితో యుద్ధం చేయటానికి భయపడ్డట్టు నటిస్తూ అడవుల వెంట పరిగెత్తారు. అది చూసి...

"ఓ యదు వీరులార రభ
సోద్ధతి బాఱకు డిట్లు పాఱినం
బోయెదు వాడగాను మిము
భూమి నడంగిన మిన్ను బ్రాకినం
దోయధి జొచ్చినం దగిలి
త్రుంచెద నంచు సమస్త సేనతో
బాయక వచ్చె వెంటబడి
బాహు బలాఢ్యుడు మాగధేశుడున్"

అతని మాటలు వినిపించుకోకుండా బలరామకృష్ణులు పోయిపోయి, పదకొండు యోజనాల పొడుగూ పదకొండు యోజనాల వెడల్పూ ఉన్న ప్రవర్షణ గిరిని సమీపించారు. చకచకా దాని మీదికి యెక్కి వెళ్లారు.

సైన్యంతో ఆకొండ మీదకు వెళ్లటం జరాసంధునకు అసాధ్యమైన పనిగా తోచింది. అందుకనే, అతను అక్కడ ఆగి, ఆ కొండ చుట్టూ రాసులు రాసులుగా

కాష్టాలు పేర్పించి వాటికి నిప్పు అంటించాడు.
దాంతో...

" పొగలెగసె బొగల తుదలను
మిగులుచు మిడుగులులు నిగిడె మిడుగులు గమి ము
న్నుగ బ్రహ్మాండము నిండెను
భగభగ మని మంట లొదవె భయదము లగుచున్ "

అది చూసిన జరాసంధుడు బలరామ కృష్ణులను భస్మీపటలం చేసి నంతగా సంతోషింఁచాడు. కాని...

" ఇల నేకాదశ యోజన
ముల పొడవగు శైల శిఖరమున నుండి వడిఁ
బల కృష్ణులు రిపు బలముల
వెలి కుఱికిరి కానబడక విలసిత లీలన్ "

అది జరాసంధుడు గ్రహించలేక పోయినాడు. అందుక నే; విజయోత్సాహంతో తిరిగి తన దేశానికి వెళ్లి పోయినాడు కూడా.

ఆ తరువాత రుక్మిణీ స్వయంవర సమయంలో తిరిగి జరాసంధుడు శ్రీకృష్ణునితో యెదిరించాడు; అప్పుడుకూడా అతను ఓడి పోవటమే జరిగింది.

ఆ విధంగా, శ్రీకృష్ణుని చేతులో, జరాసంధునికి పదిహేడు సార్లు పరాజయం సంభవించింది.

అదలా ఉండగా, ధర్మరాజు రాజసూయ యాగాన్ని తలపెట్టాడు. ఆ కార్యాన్ని నిర్విఘ్నంగా నెరవేర్చటానికి శ్రీకృష్ణుడు పరివార సమేతంగా ఇంద్ర ప్రస్థపురానికి తరలి వెళ్లాడు. అక్కడ...



## ★ 2. వ, రంగం ★

[ అది ఇంద్రప్రస్థపురం వెలుపల ఉన్న వనం. అక్కడ ధర్మరాజు భీమార్జున నకుల సహదేవులతోసహా శ్రీకృష్ణుని కోసం యెదురుచూస్తూ ఉన్నాడు.

అంతలో దూరంనుంచి రథాలు వస్తున్న ధ్వని వినిపించింది. ధర్మరాజాదులు అమితోత్సాహంతో అటు చూశారు.
మరి కొంతసేపటికి, శ్రీకృష్ణుడు అక్కడకు వచ్చాడు. ధర్మరాజు ఆతనిని అతిభక్తితో ఆలింగనం చేసుకున్నాడు. ఆ వెంటనే భీముడూ అర్జునుడూ ముందుకువచ్చి తమ మేనబావను ప్రేమతో కౌగిలించుకున్నారు. ]



# ★ 3 వ, రంగం ★

[ ధర్మరాజు మందిరంలో, కుంతీదేవీ, ఆమె కోడలు ద్రౌపదీ కృష్ణునికోసం యెదురు చూస్తున్నారు. పరిచారికలు హారతి పళ్లెరాలు పట్టుకుని నిలబడ్డారు.

అంతలో, ధర్మరాజు దారితీస్తుండగా, శ్రీకృష్ణుడు రుక్మిణీ సత్యభామలతో ప్రవేశించాడు.

కుంతీదేవి, తను కూర్చున్న మంచంమీదినుంచి దిగి, శ్రీకృష్ణుని అత్యాదరంతో ఆలింగనం చేసుకుంది. ఆయన ఆమె పాదాలు తాకి గౌరవం చూపాడు.

ద్రౌపది కృష్ణునకు నమస్కరించింది; కుంతీదేవికి మారుగా, రుక్మిణీ సత్యభామలకు పళ్లూ తాంబూలమూ మణిమయ దుకూలాలూ సమర్పించింది; వారిని ఆప్యాయంగా ఆలింగనం చేసుకుంది. ]



## ★ 4. వ్రంగం ★

[ ఆది ధర్మరాజు సభ. శ్రీకృష్ణుడు ధర్మరాజుకు ప్రక్కగా కూర్చున్నాడు. వారికి యిరువైపులా భీమార్జునులూ నకుల సహదేవులూ ఆశీనులై ఉన్నారు. ]

**ధర్మరాజు:** కృష్ణా! రాజసూయం చేయాలన్న కోరిక మాలో తీవ్రంగా ఉంది. దానిని నిర్వహించ గల వాడవు నువ్వే అని కూడా మేం దృఢంగా విశ్వసిస్తున్నాం. అంతే కాదు;

"ఎవ్వరు నీ పదాంబుజము
లెప్పుడు గొల్తురు భక్తినిష్టులై
ఎవ్వరు నిన్ను బ్రేమ నుతి
యింతురు భూరి వివేకశాలులై
య వ్విమలాత్ము లందుదు రు
దంచిత శోభన నిత్య సౌఖ్యముల్
నివ్వటిలంగ గృష్ణ నిను
నేర్చి భజించిన రిత్తవోవునే"

**కృష్ణుడు:** ( మందహాసంతో )

"నయగుణశాలి పాండు నృప
నందన నీ తలపొప్పు నీ క్రతు
క్రియ మునిదేవతా పితృ సు
కృత్యమునై నిఖిలోగ్ర శాత్రవ

జయమును బాంధవ ప్రియము
　　నంచిత పుణ్యము నిత్యకీర్తియున్
జయము నొసంగు పేని గురు
　　సత్తమ వేగ యుపక్రమింపవే"

ఈ విషయంలో మీకు కొరతకూడా యేమీ లేదు.

"మనుచరిత నీ సహోదరు
లనుపమ దివ్యాస్త్రవేదు లాహవ భూమిం
జెనకిన వైరి నృపాలుర
దునుమగ జాలుదురు శౌర్య దుర్దమభంగిన్"

[ అది విన్న భీమార్జున నకుల సహదేవులు శ్రీకృష్ణునికి కృతజ్ఞత చూపుతూ తలలు వంచుకున్నారు. ]

...వారి అండదండలు మీకు ఉండనే ఉన్నై. ఇక

"గెలువుము విమత నృపాలుర
వెలయుము బుధవినుతమైన విశ్రుతకీర్తిన్
నిలుపుము నిఖిల ధరామం
డలిని భవచ్ఛాసనము దృఢంబుగ జెల్లన్"

[ శ్రీకృష్ణుని అభిమాన పూర్వకమైన మాటలకు ధర్మరాజు అమితంగా ఆనందించాడు. ఆయన యిచ్చిన సలహాను ఆజ్ఞగా స్వీకరించాడు. పొంగులువారే ఉత్సాహంతో ఆయన్ని ఆలింగనం చేసుకున్నాడు; 'కృష్ణా!' అంటూ. ]



# ★ 5. ప్రరంగం ★

[ కథకుడు ఆ తరువాత జరిగిన గాథ చెబుతున్నాడు. ]

**కథకుడు:** ...ఆ తరువాత ధర్మరాజు ఆజ్ఞమీద భీమార్జున నకుల సహదేవులు నలుగురూ తమతమ బలాలను సమకూర్చుకున్నారు. తమ శక్తి సామర్థ్యాలను ప్రదర్శించటానికీ, తమ అన్నగారి ఆధిపత్యాన్ని రాజు లందరి చేతా అంగీకరింప చేయటానికీ వారు నిశ్చయించుకున్నారు. హస్తినాపురంనుంచి బయలు దేరారు.

అలా బయలుదేరిన అన్న దమ్ములు నలుగురూ నాలుగుదిక్కులకు వెళ్లారు. వారు అడుగు పెట్టిన ప్రతిచోటా వారికి విజయమే లభిస్తూవచ్చింది. అదలా ఉండగా ...



## ★ 6. వ, రంగం ★

[ అది మగధరాజైన జరాసంధుని మందిరం. అందులో జరాసంధుడూ శిశుపాలుడూ ముచ్చటించుకుంటున్నారు. ]

**జరాసంధుడు:**

శిశుపాలా! ఎప్పుడో ఓడిపోయినామని యిప్పుడు విచారపడితే యేం లాభం? ఎప్పుడు యే అవకాశం లభిస్తే అది మనం ఉపయోగించుకోవాలి. నామటుకు నేను, ఆ యాదవులమీద పదిహేడుసార్లు యుద్ధం చేశాను. పదిహేడుసార్లూ పరాజయాన్నే పొందాను. అయితే యేం? నాలో నిరాశ అన్నది ప్రవేశించనే లేదు. పద్ధెనిమిదోసారి మళ్లీ వెళ్లాను. ఆ బలరామ కృష్ణులను అడవిలోకి తరిమేసి, అక్కడ, వారిని అగ్నికి ఆహుతి చేశాను. మగసిరి అంటే అది; అలా ఉండాలి!

**శిశుపాలుడు:**

నేనది కాదనటం లేదు. అటువంటి అవకాశానికే నేనూ యెదురు చూస్తున్నాను.

[ అంతలో అర్జునుడు ప్రవేశించాడు. జరాసంధ శిశుపాలురు అతనివంక అదోవిధంగా చూశారు. ]

**జరాసంధుడు:**

మాధవుని ముద్దుల మరదికి మగధేశ్వరుడు స్వాగతం చెబుతున్నాడు!

[ జరాసంధుడు కంటిచూపుతోనే ఆసనం చూపించాడు; కాని, అర్జునుడు అటు అడుగుకూడా వెయ్యలేదు. అతని ముఖం జేవురించింది. అది చూసిన శిశుపాలుడు పకపక లాడాడు. ]

**అర్జునుడు:** ఉఁహుఁ! మహీపతులు కాగానే సరికాదు; మర్యాద కూడా తెలుసుకోవాలి!

[ తిరిగి జరాసంధుడూ శిశుపాలుడూ వికటంగా నవ్వారు. ]

**జరాసంధుడు:**

ఉఁ హుఁ! మర్యాద...!

( శిశుపాలునితో )

...నిజమే! మర్యాద అనేది మనం వీళ్ళదగ్గిరే నేర్చుకోవాలి!... కన్న కొడుకును గంగపాలేయటమూ ఒకే ఒక పడుచును అన్నదమ్ములందరూ పెళ్లిచేసుకోవటమూ...వీళ్ల వంశంలో విశేషాలే!

[ ఆ మాట అంటూనే జరాసంధుడు విరగబడి నవ్వాడు. శిశుపాలుడుకూడా అతని ననుకరించాడు. అర్జునుడు ఆ అవమానాన్ని భరించలేకపోయినాడు. అతని చెయ్యి అమాంతంగా కత్తిపిడి మీదకు వెళ్లింది. వెళ్లటమేకాదు. కత్తిని ఒరలోనుంచి సగంవరకు పైకి తీసిందికూడా. కాని, ఆ వెంటనే, అర్జునుడు దాన్ని తిరిగి ఒరలో దింపేశాడు.

అతని అట్టహాసంచూసిన జరాసంధుడూ శిశుపాలుడూ తిరిగి విరగబడి నవ్వారు. అది చూసిన అర్జునుడు గిఱ్ఱున వెనక్కు తిరిగాడు. ]

**జరాసంధుడు:**

...ఇంద్రతనయులు యెందుకు వచ్చారో...అది...

[ ఆమాట విన్న అర్జునుడు అక్కడే ఆగాడు. ]

**శిశుపాలుడు :**

చెప్పే దేముంది...? ఏదో బెదిరిద్దామని వచ్చి ఉంటాడు ; బెదిరి పారిపోతున్నాడు. అతణ్ణి ఆపటం కూడా అన్యాయమే !

**జరాసంధుడు :**

కావచ్చు. కాని, మన సముఖానికి వచ్చినవాడు వెళ్లే ముందు మనసెలవు తీసుకోవటం మర్యాద కదూ ?

[ అర్జునుడు వారివేపు తిరిగాడు. వారివంక చురచురా చూశాడు. ]

**శిశుపాలుడు :**

ఔను. కాని...

**అర్జునుడు:** ఊహుఁ...! సార్వభౌముని ప్రతినిధి సామంతుని సెలవు తీసుకోవటమా... ?

[ అదివిన్న జరాసంధుడు దెబ్బతిన్నట్టుగా అతనివంక చూశాడు. శిశుపాలుడు తలవంచేసుకున్నాడు.

ఆ వెంటనే అర్జునుడు వెనుకకుతిరిగి గబగబా వెళ్లసాగాడు. అది చూసిన జరాసంధ శిశుపాలురు విరగబడి నవ్వారు. ]



# ★ 7. వ, రంగం ★

[ అది ఇంద్రప్రస్థపురంలో ధర్మరాజు కొలువు. అందులో భీమ నకుల సహదేవులూ, శ్రీకృష్ణుడూ ఉచితాసనాలమీద ఉన్నారు. ]

ధర్మరాజు:

...ఇంద్ర నందనుడు యింకా రానేలేదు!

కృష్ణుడు : అతని పని అంత తేలిగ్గా అయేది కాదు!

భీముడు: ( కృష్ణయ్య నుద్దేశించి )

...మీామనసులో జరాసంధుడు మెదులుతున్న ట్టున్నాడు!

ధర్మరాజు: ఆధారం లేకుండా ఆయన అలా అనుమానించరు. ఆ జరాసంధుని శక్తిసామర్థ్యాలు మనకంటె ఆయనకే బాగా తెలుసు.

[ భీముడు ఉద్రేకపడ్డాడు. శ్రీకృష్ణుడు అది గ్రహించి మందహాసం చేశాడు.

అంతలో అర్జునుడు ప్రవేశించాడు. అతనిలో అమితమైన ఆవేదన కనబడుతోంది.

ధర్మరాజాదులు అతని వంక చూశారు; నివ్వెరపోయినారు. కృష్ణయ్య లేచి, అర్జునుని సమీాపించాడు. ]

కృష్ణుడు: ఊఁ...!బావగారేదో బాధపడుతున్నారు!

అర్జునుడు: ( తలపంచుకునే )

... నువ్వు అనుమానించినట్టే అయిందిబావా! మాగధునికి మనమంటే లక్ష్యమే లేదు. అతనికి తోడు చైద్యుడొకడు తయారైనాడు.

[ అది విన్న భీముడు అమాంతంగా లేచినుంచుని గద యెత్తాడు. కృష్ణయ్య అతనివంక చూశాడు. చూసి... ]

**కృష్ణుడు:** ...శాంతించు బావా...శాంతించు! మన రోజులు మంచివి కానప్పుడు చీమలు కూడా పాములమాదిరి బుసకొడతై!

[ ధర్మరాజు తల పంకించాడు. భీముడు అలాగే నిలబడి ఉన్నాడు. ]

...అదను చూసి అరివీరుల్ని హత మార్చాలిగాని ఆవేశపడితే యేమౌతుంది?

**భీముడు:** అతని గర్వాన్ని హరించాలి; మా హృదయం శాంతించాలి. అంతే!

**కృష్ణుడు:** ( చిరునవ్వుతో )

ఆ అవకాశాన్ని నేను నీకే యిస్తాను. సరేనా?

[ భీముడు, కొద్ది శాంతించినట్టుగా తలపంకించి కూర్చున్నాడు. ధర్మరాజాదులు మందహాసం చేశారు.



## ★ 8. ప్రరంగం ★

[ అది జరాసంధుని అతిథి పూజా మందిరం. ఒక బ్రాహ్మ ణుడు పైడిపీటమీద కూర్చుని ఉన్నాడు. జరాసంధుడు అతని పాదాలు కడుగుతున్నాడు.

అంతలో మరిముగ్గురు బ్రాహ్మణులు లోపలకు వచ్చారు. జరాసంధుడు వారివంక చూశాడు. ]

**జరాసంధుడు :**

...దయ చెయ్యండి !

[ వారు ఆసనాలమీద కూర్చున్నారు. పూర్వం చేస్తున్న అతిథి పూజ పూర్తికాగానే, జరాసంధుడు, ఆ బ్రాహ్మణుల దగ్గరకు వెళ్లాడు. వెళ్లి, వారికి సాష్టాంగపడి లేచి నుంచు న్నాడు. వారు అతణ్ణి ఆశీర్వదించారు. ]

**బ్రాహ్మణుడు:** 1.

" ధరణీశ ! యతిథిపూజా
పరుడవు నీ వనుచు దిశల బలుకగ విని మే
మరుదెంచితిమి మదీప్సిత
మఱసేయక యిమ్ము సువ్రతాచారనిధీ "

2. " అతిథి జనంబుల భక్తిఁ
సతతము బూజించి యుచిత సత్కారములు
న్నతి నడపు సజ్జనులు శా
శ్వత కీర్తులు ధరణి బడయ జాలుదు రనఘా !"

3. " పరికింపగ దేహం బ
స్థిరమని నిజబుద్ధి దలచి చిరతర కీర్తి
స్ఫురణం బ్రస్తుతి కెక్కని
పురుషుడు జీవన్మృతుండు భూరివివేకా ! "

**జరాసంధుడు:**

(వారికి నమస్కరిస్తూ )

...బ్రాహ్మణోత్తముల దర్శనంవల్ల నాజన్మ తరించింది.

" భూరి గుణులార మీమది
కోరిక యొఱిగింపు డేమి కోరిననైనన్
ధీరత నొసగుదుఁ దయే కా
దారయ నా శిరము ద్రుంచియైనను నిత్తున్ "

[ బ్రాహ్మణులు ఒకరివంక ఒకరు సాశ్చర్యంగా చూసు కున్నారు ; చిలిపిగా నవ్వుకున్నారు. ]

**బ్రాహ్మణుడు:**

1. రాజేంద్రా ! నువ్వు ఆడితప్పనివాడవనీ, అర్థిజన మందారుడవనీ, అతిథిపూజా ధురంధరుడవనీ మాకు తెలుసు. అందుకనే మేము నీ దర్శనానికి రావటం జరిగింది !

**జరాసంధుడు:**

...ఇంతకూ...తమరు...

**బ్రాహ్మణుడు:** 1.

...అదే చెబుతున్నాను.

... ఇతను యింద్ర తనయుడు ...

[ జరాసంధుడు ఆశ్చర్యపడ్డాడు. అర్జునుడు వికటంగా మందహాసం చేశాడు. ]

... ఈయన పావని ...

[ భీముడు గర్జించాడు. జరాసంధుడు దెబ్బతిన్నట్టుగా ఒక అడుగు వెనక్కు వేశాడు. ]

... ఇక, నన్ను...ఉపేంద్రు డంటారు !

**జరాసంధుడు:**

... హరిహరీ ...! ఎంతమోసం ? ఎంతమోసం ?

**బ్రాహ్మణుడు:** 1.

...నువ్వు మాలో యెవరితోనో ఒకరితో మల్ల యుద్ధం చేయాలి. అదే మా కోరిక !

జరాసంధుడు:

ఊఁ హుఁ! కృష్ణా! నువ్వు బ్రతికి బయట పడ్డా వన్న మాట!

బ్రాహ్మణుడు: 1.

...కనబడుతూనే ఉన్నానుగా!

జరాసంధుడు:

ఊఁ! నా బాహుబలం నీకు తెలియనిది కాదు. నీ వంచన నాకు క్రొత్తది కాదు. నా ప్రతాపానికి తట్టుకో లేక పారిపోయిన నీతో తిరిగి నేను పోరాడటమా? ఊఁ హుఁ!

[ కృష్ణయ్య మందహాసం చేశాడు. ]

... ఇక యీ యింద్రతనయుడున్నాడు. ఇతను వయసులోనే కాదు, అన్నివిధాలా మాకంటె చిన్న వాడే. ఇతనితో పోరాడటం మాకు చాలా తల వంపులుగా ఉంటుంది.

[ అర్జునుడు భరింపరాని అవమానంతో తలవంచుకున్నాడు.]

... ఐనా... నీకోరిక నేను చెల్లిస్తాను; భీమునితో పోరాడుతాను.

[ భీముడు ఉప్పొంగిపోయినాడు. ]

... కృష్ణా ...! ఈ భాగ్యానికి యింత మోసం చెయ్యాల్యా? యుద్ధానికి రమ్మంటే నేను రానంటానా? ఏమైనా, నీ ప్రకృతి మాత్రం నాకు అర్థం కాకుండానే ఉంది.

[ శ్రీ కృష్ణుడు చిలిపిగా నవ్వాడు. జరాసంధుడు భీమునకు గద నందించాడు ]

ఊఁ... తీసుకో!!

[ భీముడు గద నందుకున్నాడు; ఉరిమినట్టుగా నవ్వాడు. అది చూసిన కృష్ణయ్య మందహాసం చేశాడు. ]



# ★ 9. వ, రంగం ★

[ కథకుడు ఆ తరువాత జరిగిన గాథ చెబుతున్నాడు. ]

**కథకుడు :** ... ఆవిధంగా భీమసేనునకు గద నందించి, జరాసంధుడు మరొక గద తీసుకున్నాడు. ఆ వెంటనే నలుగురూ నగరం వెలుపలకు వెళ్లారు. అక్కడ ...

" గదసారించి, జరాతనూభవుడు హుం
కార ప్రఘోషంబులం
జద లల్లాడగ బాదఘట్టనములన్
సర్వం సహాభాగముం
గదలన్ వాయుజు వ్రేసె వ్రేయ నతడు
గ్రక్రోధదీప్తాస్యుడై
యది దప్పించి విరోధిమస్తకము వ్రే
యన్ వాడు పోదట్టుచున్ '

" మడవక భీమసేనుడును
మాగధరాజు గడంగి బెబ్బులుల్
విడివడు లీల నొండొరుల
పీపులు మూపులు నుం బ్రకోష్ఠముల్
నడితల లూరు జాను జఘు
న ప్రకరంబులు బిట్టు వ్రయ్యగా
బిడుగులబోలు పెన్గదల
వెట్టుగ వ్రేయుచు బాయుచుండగన్ "

అప్పుడు యేమయింది...? ఆ గదలు రెండూ తునాతునకలైపోయినై. ఆ వెంటనే వారు ముష్టియుద్ధానికి దిగారు. అంతలో...

" ప్రక్కలు చెక్కులున్ మెడలు
పాణితలంబులచే బగుల్చుచున్
ముక్కులు నక్కులుం జెవులు
ముష్టి హతిన్ నవియంగ గ్రుద్దుచున్
డొక్కలు బిక్కలున్ ఘనక
ఠోర పదాహతి నొంచుచున్ నెఱుల్
దక్కక స్రుక్క కొండొరుల
దాక్కొని పేర్కొని పోరి రుగ్రతన్ "

అప్పుడు ....



# ★ 10. వ, రంగం ★

[ అది ఊరి వెలుపలనున్న ఒక సమతల ప్రదేశం. అందులో భీమ జరాసంధులు ముష్టియుద్ధం చేస్తున్నారు. ఇద్దరి శరీరాలూ నెత్తురోడుతున్నై. ఇద్దరి శక్తీ క్షీణించినట్టుగా ఉంది. ఊపిరి పీల్చుకోవటానికి యిద్దరూ ప్రయత్నం చేస్తున్నారు. కృష్ణార్జును లది చూస్తూ నుంచున్నారు.

భీముని శక్తి క్షీణించిందని కృష్ణుడు గ్రహించాడు. అందుకనే తన దివ్య తేజాన్ని అతని గొంతులో ప్రవేశింప చేశాడు; అతనికి యినుమడించిన శక్తిని ప్రసాదించాడు.

అంతలో భీముడు గుద్దిన గుద్దుకు జరాసంధుడు దూరంగా వెళ్లి పడ్డాడు. అతను లేవటానికి ప్రయత్నించే లోపల భీముడు కృష్ణునివంక చూశాడు.

ఆ వెంటనే శ్రీకృష్ణుడు ఒక ఆకును తీసుకుని, భీముడు చూస్తూఉండగా, దాన్ని మధ్యకు చీల్చాడు. అలా చీలి పోయిన రెండు ముక్కలనూ రెండువైపులకు విసిరివేశాడు. జరాసంధుని అలా చేయమన్నట్టు భీమునికి సైగ చేశాడు. భీము డది గ్రహించాడు.

అంతలో జరాసంధుడు తిరిగి భీమునిమీద కలియబడ్డాడు. భీముడు మరొక గుద్దుతో అతనిని ప్రక్కకు పడేశాడు. వెంటనే అతనిమీదికి ఉరికాడు.

మరుక్షణంలో, ఆ ప్రక్కనుంచి, భీకరమైన గర్జన ఒకటి వినిపించింది. భీముడు వికటాట్టహాసం చేయటం కూడా కృష్ణార్జునులు గ్రహించారు.

ఆ వెంటనే, రెండుభాగాలుగా చీలిన జరాసంధుని శరీరాన్ని చెరొక చేతితోనూ పట్టుకుని, భీముడు, శ్రీ కృష్ణుని సమీపించాడు.

శ్రీకృష్ణుడు, భీముని అభినందిస్తూ, అతని వీపు తట్టాడు. భీముడు ఆ రెండుముక్కలనూ రెండు వేపులకు విసిరివేశాడు.

అర్జునుడు భీముని సమీపించి ఆలింగనం చేసుకున్నాడు. అంతలో, జరాసంధుని కొడుకు సహదేవుడు అక్కడకు వచ్చాడు. అంతకు పూర్వం అతని తండ్రి చేత బంధింపబడిన రాజు లందరూ అతణ్ణి అనుసరించి వచ్చారు. సహదేవుడు శ్రీకృష్ణునకు నమస్కరించాడు. ఆ వెంటనే రాజు లందరూ కృష్ణార్జునులకూ భీమునకూ సాష్టాంగపడ్డారు. ]

**సహదేవుడు:**

"వరద! పద్మనాభ! హరి! కృష్ణ! గోవింద!
దాసదుఃఖనాశ! వాసుదేవ!
యవ్యయా ప్రమేయ! యనిశంబు గావింతు
నిందిరేశ నీకు వందనములు!!

[ శ్రీ కృష్ణుడు, సహదేవుని, దగ్గరకు తీసుకున్నాడు. రాజుల వంక సానుభూతితో చూశాడు.]

**కృష్ణుడు:** సహదేవా! బాహుబలమదంతో నీ తండ్రి వీరి నింతవరకూ బాధించాడు. ఆ పాపానికి తగిన ఫలం అనుభవించాడు. వీరు యిప్పుడు బంధవిముక్తులు కావటమే కాదు; జీవన్ముక్తులు కూడా అయినారు. వీరిని, యిక నువ్వు యెలా చూస్తావో యేమో!

**సహదేవుడు:**

దాసానుదాసుణ్ణి! మీరెలా చెబితే అలాగే చేస్తాను!

**రాజులు:** ...శ్రీ కృష్ణపరమాత్మకూ... జై!!



## ★ ముఖ్యపాత్రలు ★

1. శిశుపాలుడు
2. శ్రీ కృష్ణుడు
3. సహదేవుడు
4. భీష్ముడు



# శిశుపాల శిరచ్ఛేదం

## ★ 1. వ్రరంగం ★

[ కథకుడు, శిశుపాల శిరచ్ఛేదానికి సంబంధించిన గాథ చెబుతున్నాడు. ]

**కథకుడు:** ...పాండవులు రాజసూయానికి తగిన సన్నాహా లన్నీ చేశారు. పండితోత్తములైన బ్రాహ్మణ శ్రేష్టు లను ఆహ్వానించారు. యజ్ఞభూమిని పైడి నాగళ్లతో దున్నించారు. అక్కడ ధర్మరాజు యజ్ఞదీక్ష తీసు కున్నాడు.

ఆ తరువాత, ధర్మరాజు......

" సకలావనీశు లిచ్చిన
యకలంక సువర్ణరత్నహయ ధన వస్త్ర
ప్రకరంబులు మొదలగు కా
నుక లందు కొనన్ సుయోధనుని నియమించెన్."

అంతే కాదు......

" అర్థిజాతము గోరినట్టి వస్తువు లెల్ల
దగ బంచియిడగ రాధాతనూజు
సరసాన్న పానాది సకల పదార్థముల్
పాకముల్ సేయింప బవనతనయు

బంకజోదరు నొద్ద బాయక పరిచర్య
దవిలి కావింప వాసవ తనూజు
సవన నిమిత్తంబు సంచిత ద్రవ్యంబు
పెంపుతో వేగ తెప్పింప నకులు
దేవ గురు వృద్ధ ధాత్రీ సురావలులను
నరసి పూజింప సహదేవు నఖిలజనుల
బొలుచు మృష్టాన్న తతుల దృప్తులను జేయ
ద్రౌపదిని నియోగించెను ధర్మసుతుడు. "

...ఆ యజ్ఞాన్ని చూడటానికి దేవతలు కూడా తమ తమ పరివారాలతో వచ్చారు. వచ్చి, అదంతా చూసి, అంతకు పూర్వం అటువంటి మహాయజ్ఞం జరిగింది లేదని ప్రశంసించారు.

యజ్ఞం యథావిధిగా పూర్తి అయింది. యజ్ఞాన్ని నిర్వహించిన బ్రాహ్మణోత్తములనూ సదస్యులనూ కుల వృద్ధులనూ సన్మానించటం మాత్రం మిగిలి ఉంది. 'అగ్రపూజకు అర్హులెవరు' అన్న ప్రశ్నం అప్పుడు ఉదయించింది. ఆసందర్భంలో సందేహ నివృత్తి చేయవలసిందని ధర్మరాజు సదస్యులను కోరాడు. ఆ సదస్యులు కూడా యెవరికి తోచినట్టు వారు చెప్పారు.

అప్పుడు...



## ★ 2. వ, రంగం ★

[ అది యజ్ఞవాటిక. మహామహులైన మునిశ్రేష్ఠులూ భీష్మ, ద్రోణ, కృప విదురాదులూ అక్కడ ఉచితాసనాశీనులై ఉన్నారు. అందరూ యేదో ఆలోచిస్తూనే ఉన్నారు. అంతలో, సహదేవుడు లేచి నిలబడ్డాడు. ]

సహదేవుడు:

... పెద్దల సముఖాన నేనొక చిన్ని విషయాన్ని మనవి చేసుకోవా లనుకుంటున్నాను.

[ అక్కడ ఉన్నవాళ్లందరూ అతనివంక చూశారు. ]

... మానవులలో మహామహు లెవరా అని మథన పడే కంటె...

( కృష్ణయ్యవంక చూపుతూ )

యీ మహాత్ముణ్ణి సంతృప్తి పరచటం యెంతైనా సమంజసంగా ఉంటుంది.

[ భీష్మాదులు సంతృప్తిని కనబరిచారు. ఆవెంటనే అతను ధర్మరాజువేపు తిరిగాడు. తిరిగి ... ]

" ఈ పురుషోత్తమున్ జగద
 ధీశు ననంతుని సర్వశక్తు జి
ద్రూపకు నగ్రపూజ బరి
 తోషితు జేయ సమస్తలోకముల్
వే పరితుష్టి బొందు బృథి
 వీవర కావున నీవు కృష్ణునిన్
శ్రీపతి బూజసేయు మెడ
 సేయక మాటలు వేయునేటికిన్ "

[ సభికులు చాలామంది సంతోషాన్ని వెలిబుచ్చారు. ]

" ఇతడె యితండు గన్నులొక
యించుక మోడ్చిన నీ చరాచర
స్థిత భువనంబు లన్నియు న
శించు నితం డవి విచ్చి చూచినన్
వితతములై జనించు బ్రభ
విష్ణుడు విష్ణుడు నైనయట్టి యీ
క్రతు ఫలదుండుగా కొరు డొ
కం డెటు లర్హుడు శిష్టపూజకున్ "

**మునులు:** నిజం నిజం! శ్రీకృష్ణుని పూజించటమే శ్రేష్ఠమైన పని!

**భీష్ముడు:** ...మహర్షుల నిర్ణయం మానవ లోకానికి అంతకూ మహదానందాన్ని కలిగించేదిగా ఉంది.

[ ఆమాట విని ధర్మరాజాదులు సంతోషంతో కృష్ణుని సమీపించారు. బంగరు పళ్లెంలో శ్రీకృష్ణుని పాదాలుకడిగి, ఆ పాదోదకాన్ని తమ శిరస్సులమీద చల్లుకున్నారు. అర్జును డందించిన నూత్నవస్త్రాలను, ధర్మరాజు, శ్రీకృష్ణునకు సమ ర్పించుకున్నాడు. అది జరుగుతున్నంతసేపూ సదస్యులు జే జే ధ్వానాలు చేస్తూనే ఉన్నారు. దేవతలు పుష్పవర్షం కురి పిస్తూనే ఉన్నారు; మంగళవాద్యాలు మోగిస్తూనే ఉన్నారు.

అంతవరకూ, యేమిచేయటానికీ తోచక బుసలుకొడుతూ ఉన్న శిశుపాలుడు, అప్పుడు తన ఆవేశాన్ని ఆపుకో లేక పోయినాడు. సభాసదులవంక అదో విధమైన హీనభావంతో చూశాడు. చూసి... ]

" చాలు బురే యహహా యీ
కాలము గడపంగ దురవగాహంబగు నీ
తేలా తప్పెను నేడీ
బాలకు వచనములచేత బ్రాజ్ఞుల బుద్ధుల్ "

[ సభికు లందరూ అతనివంక చూశారు. సభలో కలకలం ప్రారంభ మయింది. శిశుపాలుడు వికటంగా నవ్వాడు. నవ్వి. ]

" గురు దేవశూన్యుండు కులగోత్ర రహితుండు
తలి దండ్రు లెవ్వరో తడవ గాన
మప్పుల బొరలేదు నాదిమధ్యావసా
నంబులం దరయ మానంబు లేదు
బహురూపియై పెక్కు భంగుల వర్తించు
వాని వర్తనములు వరుస లేవు
పరికింప విగత సంబంధుండు దలపోయ
మా నిమిత్తంబున మాని సర్వే
బరగమున్న యయాతి శాపమున జేసి
వాసి కెక్కదు యీ యదువంశ మెల్ల
బ్రహ్మతేజంబునెల్ల గోల్పడిన యితడు
బ్రహ్మ ఋషి సేవ్యుడగునె గోపాలకుండు "

ఉఁహుఁ! విజ్ఞాన ధనులు, పరమ యోగీంద్రులు, మహదైశ్వర్య యుతులు, శక్తిసంపన్నులు యెందరో యిక్కడ ఉండగా, యీ జారుడు, చోరుడు అయిన కృష్ణుడు అగ్రపూజకు అర్హుడుగా కనిపించాడా? ఏం అన్యాయం? ఎంతటి అవమానం?

[ కొందరు మునులు ఆ మాటలు వినలేక 'హరిహరీ' అని చెవులు మూసుకున్నారు. 'వీడి పాపం పండింది' అని కొందరు రాజులన్నారు. 'ఉట్టి దుర్మార్గుడు; నోటి కొచ్చినట్లల్లా ప్రేలుతున్నాడు' అని మరికొందరు సదస్యులన్నారు. సభ అంతా అల్లకల్లోలమై పోయింది.

కేకయ, సృంజయ భూపతులు శిశుపాలునివేపు తిరిగి విల్లులు యెక్కుపెట్టారు. భీముడు భీకరంగా గర్జించాడు;

గదనెత్తి నుంచున్నాడు. అయినా శిశుపాలుడు భయపడలేదు. భయపడక పోవటమే కాదు కత్తిని దూసి వాళ్లమీదికి ఉరికాడు కూడా.

అంతలో కృష్ణయ్య లేచినిలబడ్డాడు; చిరునవ్వుతో సభికుల వంక చూశాడు; ఆవెంటనే సుదర్శన చక్రాన్ని శిశుపాలుని మీదకు వదలాడు.

సుదర్శన చక్రాన్ని చూడగానే శిశుపాలునికి ప్రాణభీతి కలిగింది. అతను అక్కడినుంచి పారిపోవాలని ప్రయత్నించాడు. కాని, మరుక్షణంలోనే ఆ సుదర్శనచక్రం అతని తలను తరిగేసింది. అంతే. ఆ వెంటనే, అతనిలోనుంచి ఒక బ్రహ్మాండమైన వెలుగు బయలుదేరి, శ్రీకృష్ణునిలో ప్రవేశించింది. అది చూసిన సభాసదులు శ్రీకృష్ణునకు జేజేలు చెప్పారు. ]

**ఒకరాజు:** ఉహూఁ ...! ఎంత దుర్మార్గుడైతే యేం...మహా మహాఁలకు కూడా అందరాని మహద్భాగ్యాన్ని పొందాడు !

**మరొకరాజు:**

అతనిలో యేదో విశేషం ఉండే ఉంటుంది !

**ఒకముని:** ఏముంది ? మాత్సర్యంతో అయినా అతను మాధవుణ్ణి మనసులో నిలుపుకున్నాడు; మళ్లీ జన్మ లేకుండా చేసుకున్నాడు. అంతే !

[ వారు అలా మాట్లాడుకుంటూ ఉండగానే, ధర్మరాజాదులు శ్రీకృష్ణుని సమీపించారు; అతణ్ణి భక్తితో ఆలింగనం చేసుకున్నారు. సభాసదులందరూ, తిరిగి, కృష్ణయ్యకు జేజేలు చెప్పారు. ]



★ ముఖ్యపాత్రలు ★

1. శ్రీకృష్ణుడు
2. సాల్వుడు
3. దంతవక్త్రుడు



# సాల్వ దంతవక్త్రుల వధ

## ★ 2. వ, ర ం గ ం ★

[ ఒక కథకుడు సాల్వ దంతవక్త్రుల వధలకు సంబంధించిన గాథ చెబుతున్నాడు. ]

కథకుడు: ...పౌండ్రకవాసుదేవుడూ, జరాసంధుడూ, శిశుపాలుడూ, సాల్వభూపతీ దంతవక్త్రుడూ ప్రాణస్నేహితులు.

శ్రీ కృష్ణుడు పౌండ్రక, జరాసంధ శిశుపాలురను సంహరించిన తరువాత, యెలాగయినా అతనిమీద పగతీర్చుకోవాలని సాల్వభూపతి నిశ్చయించుకున్నాడు. అందుకని, అతను, శంకరునిగూర్చి ఘోరమైన తపస్సు చేశాడు. ఆ తపస్సుచేసే రోజుల్లో, అతడు, రోజుకు ఒక పిడికెడు మట్టిని మాత్రమే ఆహారంగా తీసుకునేవాడు.

సాల్వభూపతి తపస్సుకుమెచ్చి, శంకరుడు ప్రత్యక్షమై, 'నీకు యే వరం కావాలి?' అని అడిగాడు. దానికి సమాధానంగా, సాల్వుడు...

"గరుడ గంధర్వ యక్షరాక్షస సురేంద్ర
వరులచే సాధ్యపడక నా వలయునెడల
నభ్రపథమున దిరిగెడు నట్టి మహిత
వాహనము నాకు దయసేయు వరద యీశ!"

అని ప్రార్థించాడు. సాల్వుని కోరికను శంకరుడు మన్నించాడు. మన్నించటమే కాదు; అతను కోరిన విమానాన్ని నిర్మించవలసిందిగా మయునకు ఆజ్ఞాపించాడుకూడా. ఆ వెంటనే, మయుడు, యెవ్వరికీ కనపడకుండా ప్రయాణంచేసే ఒక పెద్దవిమానాన్ని తయారుచేసి సాల్వున కిచ్చాడు.

అది తీసుకుని, సాల్వుడు, ద్వారకానగరం మీదకు దండెత్తి వెళ్లాడు. అలా వెళ్లి...

"సరిదుపవన సరోవరములు మాయించి
బావులు గలచి కూపములు చెఱిచి
కోటలు వెసపీట తాటముల్ గావించి
పరిఖలు పూడ్చివప్రములు ద్రోసి
యట్టళ్లు ధరగూల్చి యంత్రముల్ దునుమాడి
కాంచనధ్వజ పతాకములునఱికి
భాసుర గోపుర ప్రాసాద హర్మ్యేందు
శాలాంగణములు భస్మములు సేసి
వివిధ కాంచన రత్నాది వివిధవస్తు
కోటినెల్లను నందంద గొల్లవుచ్చి
ప్రజలజెఱపట్టి దొరలను భంగపెట్టి
తఱిమి యిభ్భంగి బెక్కుబాధల కలంచె"

ఆ సమయంలో, శ్రీకృష్ణుడు ద్వారకానగరంలో లేడు. అందుకని భగవంతుడైన ప్రద్యుమ్నుడు, నగరరక్షణకు సంబంధించిన బాధ్యతను తనమీద వేసుకున్నాడు; ఆ వెంటనే దివ్యసాధనాలు తీసుకుని, సైన్యాన్ని చేకూర్చుకుని రణరంగంలో ప్రవేశించాడు.

సాల్వునికీ ప్రద్యుమ్నునికీ మధ్య ఇరవై యేడు రోజులు ఘోరమైన యుద్ధం జరిగింది. అంతలో సాల్వుని మంత్రి, ద్యుముడు, ముందుకు వచ్చాడు. అది చూసిన ప్రద్యుమ్నుడు అతనితో ప్రత్యేకించి పోరాటం సాగించాడు. ఆ యుద్ధంలో సాల్వ యదు సైన్యాలు రెండూ చాలావరకు క్షీణించిపోయినై.

అదే సమయంలో, శ్రీకృష్ణుడు, యింద్రప్రస్థంలో బయలుదేరాడు; ద్వారకవేపుగా వస్తున్నాడు. ఆయన యింద్రప్రస్థంలో బయలుదేరినప్పుడే యెన్నో దుశ్శకునాలయినై. అవి చూసి, ఆయన, కొంచెం కలవరపడ్డాడు. అందుకనే...



## ★ 2. ప్ర రం గం ★

[ అది యింద్ర ప్రస్థానికీ, ద్వారకకూ మధ్య ఉన్న బాట. శ్రీకృష్ణుడు రథంమీద ఉన్నాడు. ఆయనలో అదోవిధమైన ఆందోళన కనబడుతోంది. ]

కృష్ణుడు: "కంటే దారక దుర్నిమిత్తము లనే
కంబుల్ మహాభీలముల్
మింటన్ మేదిని దోచుచున్నయవి నె
మ్మిన్ ఖాండవప్రస్థ మే
నుంటం జైద్యహితక్షితీశ్వరులు మా
యోపాయులై పత్పురి
న్గెంటింపం జనుదేర బోలుదురు
పోనీ తేరువేగంబునన్"

[ ఆమాట విని, సారథి, గుఱ్ఱాల నదలించాడు. రథం వాయువేగంతో పరుగెత్త సాగింది. ]



## ★ 3. వ, రంగం ★

[ యుద్ధరంగంలో అదొకభాగం. అక్కడ, ఆకాశంలోంచి కొండలకు కొండలే క్రిందపడుతున్నై. నాలుగు మూలల నుంచీ వికటాట్టహాసాలు వినిపిస్తున్నై.

యుద్ధరంగంలో ఉన్న యాదవవీరులు నిరాసతో చిందర వందరై పోతున్నారు. వారికి ధైర్యాన్నీ ఉత్సాహాన్నీ కల్పించాలని ప్రద్యుమ్నుడు యెంతగానో ప్రయత్నిస్తున్నాడు ]

ప్రద్యుమ్నుడు:

... ఆగండి...! ఆగండి ! యాదవ వీరులారా... ఆగండి ! పిరికి పందలై పారిపోకండి ! ప్రాణరక్షణ కోసం పారిపోతే పరాజయం తప్పదు. పరాజయం పొంది బ్రతికే కంటె ప్రాణత్యాగం మేలు...! దీనుల కోసం, దేశం కోసం పోట్లాడండి! యాదవులు వీరులు గాని భీరులు కారని ఋజువు చేయండి ! నిలవండి ! నిలబడి పోట్లాడితే విజయం సిద్ధిస్తుంది. పోట్లాడుతూ ప్రాణం వదిలితే వీరస్వర్గం లభిస్తుంది ! ఏదైనా మంచిదే ! ఆగండి... ! ఆగండి...!!

[ ఆ మాటలు విన్న యాదవ వీరులు కొందరు, తిరిగి రణరంగంలో ప్రవేశించారు; ప్రద్యుమ్నునికి అండగా నిలబడి విల్లమ్ములు ధరించారు; జే జే ధ్వానాలు చేశారు. ]



## ★ 4. వ, రంగం ★

[ అది, యుద్ధరంగంలో వకొక భాగం. అక్కడ ఉన్న యాదవవీరులు, ఆకాశం వంక చూస్తూ, బాణాలు వదులుతున్నారు.

అంతలో, శ్రీకృష్ణుడు ప్రవేశించాడు; ప్రవేశించగానే పైకి చూశాడు. ఏదో అర్థమైనట్టుగా తల పంకించాడు.

ఆ వెంటనే, 'సౌభరి' అనే విమానం ఆకాశంలో కనిపించింది. అందులోఉన్న సాల్వుడు కృష్ణయ్యను చూసి వికటాట్టహాసం చేశాడు.

అది గ్రహించిన కృష్ణయ్య, విల్లెక్కుపెట్టి, బాణం వదిలాడు. అదివెళ్లి ఆ విమానానికి తగిలింది. దాంతో ఆ విమానం 'పెఠీల్' మని పగిలిపోయింది; ముక్కలు ముక్కలై నేలమీద పడిపోయింది.

ఆ తరువాత, సాల్వుడు, పైనుంచి ఒకబాణం వదిలాడు. అదివచ్చి శ్రీ కృష్ణుని యెడమచేతికి తగిలింది. దానిమీద, ఆయన ఉగ్రుడై, 'శార్ఙ్గం' అనే ఆయుధాన్ని సాల్వుని మీదకు విసిరాడు. కాని, దానివల్ల యే విధమైన ప్రయోజనమూ లేక పోయింది. సాల్వుడు వికటాట్టహాసం చేస్తూనే ఉన్నాడు. కృష్ణయ్య అదిచూసి ఆశ్చర్యపోతూ నిలబడి పోయినాడు. ]

**సాల్వుడు:** ...కృష్ణా...! ఇటు చూడు...! ఇటు యిటు...!! ఇదుగో వసుదేవుడు! నీతండ్రి! చూడు! కళ్లారా చూడు! కడసారి చూపు చూసుకో! ఇదుగో, యితనిప్పుడే నాకత్తికి బలి కాబోతున్నాడు; చూస్తున్నావా...?

[ అంతలో, పైనుంచి, కృష్ణా...! కృష్ణా!! నన్ను రక్షించు తండ్రీ!!" అన్న వసుదేవునిగొంతు వినిపించింది. ఆ వెంటనే తలనరికిన శబ్దమయింది. కృష్ణయ్య చకితుడైనాడు.

మరుక్షణంలో, వసుదేవుని మొండెం కృష్ణయ్యముందు పడ్డది. అదిచూసిన కృష్ణయ్య అమితంగా కలవరపడ్డాడు. అంతలో, పైనుంచి, సాల్వుని వికటాట్టహాసం తిరిగి విని పించింది.

కృష్ణయ్య, వసుదేవుని మొండెంమీద వ్రాలాడు; నానా ...నా...న్నా...!...నా ..న్నా...!! అంటూ అరి చాడు. ఆ వెంటనే మూర్ఛపోయినాడు.
అంతలో, అక్కడకు ఒక మునీశ్వరుడు వచ్చాడు. వచ్చి' కృష్ణయ్యను చూసి ఆశ్చర్య పోయినాడు. ]

మునిః ...పరమేశ్వరా! ఏమిటీ భ్రమ? చిదానంద మూర్తి వైన నువ్వే యిలా చింతించటమా? దుఃఖ నివారణ చేసే నువ్వే యిలా దుఃఖపడటమా? పరబ్రహ్మావైన నువ్వెక్కడ...నీచజన్మవల్ల కలిగే యీ భయ స్నేహ మోహాలెక్కడ? ఏమిటి యిదంతా?

[ అంతలో కృష్ణయ్య కళ్లు తెరిచాడు; నలువంకలా చూశాడు. అంతకుముందు అతని ముందున్న అతని తండ్రి మొండెం అప్పు డక్కడ లేదు. కృష్ణయ్యకు అప్పుడు అర్థ మయింది; సాల్వుడు తనమీద మాయను ప్రయోగించాడు; అని.

ఆ వెంటనే కృష్ణయ్య, గదను తీసుకుని సాల్వుని రథం మీదకు విసిరాడు. దాంతో ఆ మాయారథంకూడా తునాతున కలై పోయింది.

ఆపైన, సాల్వుడు, కృష్ణయ్య సముఖానికి వచ్చాడు. వచ్చి, గదనెత్తి కృష్ణయ్యమీదకు ఉరికాడు.

ఆ వెంటనే కృష్ణయ్య, తన ఖడ్గాన్ని విసిరి సాల్వుని చేతిని ఖండించేశాడు. దాంతో, సాల్వుడు, హాహాకారం చేస్తూ వెనక్కు తిరిగాడు. ఆపైన, కృష్ణయ్య, తన సుదర్శన చక్రాన్ని అతనిమీదకు వదిలాడు. అది సరాసరి సాల్వుని మీదికి వెళ్లింది; అతని తలను నరికేసింది.

సాల్వుడు, నేలమీద పడగానే కృష్ణయ్యమీద పుష్ప వర్షం కురిసింది. కృష్ణయ్య, మందహాసంచేస్తూ, సాల్వునివంక చూస్తూ నుంచున్నాడు.

అంతలో, పళ్లు పటపటలాడిస్తూ, గదను త్రిప్పుతుంటూ దంతవక్త్రుడు అక్కడికి వచ్చాడు. అతను, తెగిపోయిన తన స్నేహితుని తలనుకూడా తనతోపాటు తీసుకువచ్చాడు. కృష్ణయ్యను సమీపించగానే వికటాట్టహాసం చేశాడు. కృష్ణయ్య అతణ్ణిచూసి చిలిపిగా నవ్వాడు. ]

**దంతవక్త్రుడు:**

ఊఁహుఁ... ! బంధువుడవు కదా అని యింత వరకు బ్రతుక నివ్వటం పాముకు పాలుపోసి పెంచుకోవట మయింది. ఇకనిన్ను సహించేది లేదు. కాచుకో... !

[ అంటూనే గద త్రిప్పి కృష్ణునిమీదకువిసిరాడు. శ్రీకృష్ణుడు దాన్ని అందుకుని, తిరిగి దంతవక్త్రుని మీదికి విసిరాడు.

ఆ గద, సరాసరి వెళ్లి, దంతవక్త్రుని గుండెల్లో పొదుచుకుంది. దంతవక్త్రుడు బాధతో అరచి అరచి కూలిపోయినాడు. ఆ వెంటనే అతని గొంతులోనుంచి ఒక వెలుగు బయలుదేరి శ్రీకృష్ణుని సమీపించింది; ఆయనలో ఐక్యమైపోయింది.

అదేసమయానికి దేవలోకంనుంచి విజయశంఖారావాలు వినిపించినై. పుష్పవర్షం కురిసింది.

అంతలోనే ప్రద్యుమ్నుడు అక్కడకువచ్చి, శ్రీకృష్ణుని పాదా లంటుకున్నాడు. శ్రీకృష్ణుడతణ్ణి ఆప్యాయంగా దగ్గరకు తీసుకున్నాడు. ]



## ★ ముఖ్యపాత్రలు ★

2. శ్రీకృష్ణుడు

1. కుచేలుడు

3. రుక్మిణి



# బాల్యస్నేహం

## ★ 1. వ రంగం ★

[ అదొక పూరిగుడిసె. దానినిండా, బక్క-చిక్కిన పిల్లలు లెక్క-లేనంతమంది ఉన్నారు. వాళ్లమధ్య, బొమ్మికెలప్రోగు మాదిరిఉన్న ఒక తల్లి కూర్చుని ఉంది. వాళ్లకు ఒకప్రక్క-గా, ఓ కుక్కి-మంచంమీద, ఆ పిల్లలతండ్రి కూర్చుని ఉన్నాడు. అతనే కుచేలుడు.

కుచేలుని కెదురుగా పదిపన్నెండేళ్ల పిల్లలు యిద్దరున్నారు. మరికొందరు అక్క-డే ఓమూల గోడకానుకుని కూర్చున్నారు.

తనముందున్న పిల్లలకు, కుచేలుడు, యీక్రింది ప్రార్థన పద్యాన్ని చెబుతున్నాడు. ]

**కుచేలుడు:** "హరి భజియించు హస్తములు
హస్తము లచ్యుతుగోరి మ్రొక్క- త
చ్ఛిరము శిరంబు చక్రధరు
జేరిన చిత్తము చిత్త, మిందిరా
వరు గను దృష్టి దృష్టి ముర
వైరి నుతించిన వాణి వాణి య
క్షరు కథ లాను కర్ణములు
కర్ణములై విలసిల్లుబో భువిన్"

[ ఆ పద్యాన్ని అతను ఆ పిల్లలకు అర్థమయేటట్టు విడదీసి చెప్పాడు. వారు అతను చెప్పేదంతా శ్రద్ధగా వింటూ తిరిగి అనసాగారు.

అంతలో, ఆ ప్రక్కనే ఉన్న ఒక కుఱ్ఱవాడు తనతల్లి వంక దీనంగా చూడసాగాడు. ఆమెనేదో అడగాలని అతని మనసులోఉన్నట్టుంది ; కాని, అడగలేకపోయినాడు ; అలాగే కొంతసేపు బాధపడ్డాడు. ]

**పిల్లవాడు:** ఏ. ...కడుపులో మంటగా ఉందమ్మా!

[ అది విన్న తల్లి అతనివంక సానుభూతితో చూసింది. అంతలోనే ఆమె ప్రక్కనఉన్న మరో కుఱ్ఱవాడు చలితో ఒణికిపోవటం మొదలుపెట్టాడు. ఆమె అతణ్ణి దగ్గరకు తీసుకుంది ; హృదయానికి హత్తుకుంది. అదేమీ తనకు పట్ట నట్టుగా, కుచేలుడు, తనముందున్న పిల్లలకు ప్రార్థనపద్యాలు చెబుతూనే ఉన్నాడు. ]

**కుచేలుడు:** " వారిజనాభ భక్తజన
వత్సల దుష్టమదాసురేంద్ర సం
హార సరోరుహాసన పు
రారి ముఖామర వంద్యపాద పం
కేరుహ సర్వలోక పరి
కీర్తిత దివ్యమహా ప్రభావ సం
సార విదూర నందతను
జాత రమాహృదయేశ మాధవా "

" ఆర్తజనుల మమ్ము నరసిరక్షింపు మ
హాత్మ భక్తజన భయాపహాగణ
నిన్ను మదినుతించి నీకు మ్రొక్కెదము నీ
చరణ యుగము మాకు శరణ మనఘ ! "

[ ఆవిధంగా ప్రార్థిస్తున్న కుచేలుని చెక్కిళ్లనుండి కన్నీరు కాలువగా ప్రవహించింది. అతను, తన సముఖాన శ్రీకృష్ణుడు ఉన్నాడనే భావంతోనే ఉన్నాడు. అందుకనే చేతులెత్తి నమస్కరించాడు. ]

**కుచేలుని భార్య:**

... చూడండి! మీరు...ఆయన చిన్ననాటి స్నేహితులు కదూ?

[ కుచేలుడు 'ఔన'న్నట్టుగా తల ఆడించాడు. ]

వెళ్లి...ఆయన్ని...ఒక్కసారి కలుసుకువస్తే...

**కుచేలుడు:** (వెఱ్ఱిగా నవ్వి)

నేనా...? ఆయన్ని కలుసుకోవటమా?

**భార్య:** ఏం...? తప్పేముంది?

**కుచేలుడు:** ( నవ్వి )

ఆజన్మదరిద్రుడేమిటి...పుట్టుభోగిని పలుకరించట మేమిటి?

**భార్య:** అదేమిటి? స్నేహితుల మధ్యకూడా అటువంటి భేదం ఉంటుందా?

**కుచేలుడు:** ఉండక పోవటం విశేషమే! అయినా......

**భార్య:** ఎందుకు అంతగా సందేహిస్తారు? నామాట వినండి! ఒకసారి, ఆయన దర్శనం చేసుకురండి! ... ఆయన మహానుభావుడు! అందులోనూ మీకు ప్రాణ స్నేహితుడు! అటువంటి వాడికే మీరు మీ కష్టాలు చెప్పుకోకపోతే ...

[ ఏదో ఆలోచిస్తూ కుచేలుడు తల ఆడించాడు. ]

" కలలోనం దను మున్నెఱుంగని మహా
కష్టాత్ముడైనట్టి దు
ర్బలు డాపత్సమయంబునన్ నిజపదా
బ్జాతంబు లుల్లంబులో

దలప న్నంతన మెచ్చి యా ర్తిహారుడై
తనైన్న నిచ్చున్ సుని
శ్చలభ క్తిన్ భజియించు వారి కిడడే
సంపద్విశేషోన్నతుల్ ”

[ ఆమాట విన్న కుచేలుని ముఖంలో అదోవిధమైన వెలుగు ప్రవేసించింది. ]

ఊఁ... ! ఏ మంటారు ?

కుచేలుడు: ...అనటాని కే ముంది ?

భార్య: అయితే ... వెళ్లొస్తారా ?

[ కుచేలుడు 'సరే!' అన్నట్టుగా తల పంకించాడు, అయినా అప్పటికీ యేదో ఆలోచిస్తూనే ఉన్నాడు. ]

...ఊఁ...బయలు దేరండి... !

కుచేలుడు:

( చిరునవ్వుతో )

“ నీవు సెప్పినయట్ల రాజీవనేత్రు
పాదపద్మంబు లాశ్రయింపంగ జనుట
పరమశోభన మా చక్రపాణి కిపుడు
గాను కే మైన గొంపోవ గలదె మనకు ? ”

భార్య: ( కొంచెంగా మనసు చిన్నబుచ్చుకుని )

...మనకున్న దేదో మనం సమర్పించుకుందాం !
అంతకంటె చేసే దేముంది ?

[ కుచేలుడు ఆమెవంక గంభీరంగా చూశాడు; తల పంకించాడు. ఆ వెంటనే అతను కొడుకులవంక తిరిగి ... ]

**కుచేలుడు:** ఊఁ... చెప్పండి... !

**పిల్లలు :** ( భక్తితో )

" ఆర్తజనుల మమ్ము నరసి రక్షింపు మ
హాత్మ భక్తజన భయాపహారణ
నిన్ను మది నుతించి నీకు మ్రొక్కెదము నీ
చరణ యుగము మాకు శరణ మనఘ! "

[ పిల్లలతోపాటు కుచేలుడుకూడా చేతులు జోడించాడు. ]



## ★ 2. వ్రరంగం ★

[ కుచేలుడు ద్వారకానగరంవేపు వెడుతున్నాడు. అతను కట్టుకున్న పంచ మాసిఉంది. అతని మీది ఉత్తరీయం చినిగి ఉంది. ]

**కుచేలుడు:** "హరే రామ హరే రామ
రామ రామ హరే హరే
హరే కృష్ణ హరే కృష్ణ
కృష్ణ కృష్ణ హరే హరే!"

[ అంతలో కుచేలుని కెదురుగా ఒక బ్రాహ్మణుడు వచ్చాడు. అతణ్ణి చూసి కుచేలుడు ఆగాడు; అతనికి నమస్కరించాడు. ]

... స్వామీ! ద్వారకానగరం యింకెంత దూరముంటుంది?

**బ్రాహ్మణుడు:**

( దూరంగా చూపుతూ )

అదే బాబూ ... అదే...! ఆ కనపడేదే!

( వెళ్లబోతూ ఆగి )

ఇంతకూ...మీకు యెవరు కావాలి?

**కుచేలుడు:**

( లజ్జతో )

... అక్కడ నా స్నేహితుడు ఒకాయన ఉన్నాడు...ఆయన కోసం...!

**బ్రాహ్మణుడు:** ఆయన పేరు...?

**కుచేలుడు :**

( సందేహిస్తూ )

... వాసుదేవుడు... !

**బ్రాహ్మణుడు :**

( ఆశ్చర్యంతో )

ఎవరూ...? వాసుదేవుడా ?

**కుచేలుడు:** ఆఁ ఆఁ! ఆయనే! ఆయన్ని మీా రెరుగున్నారా?

**బ్రాహ్మణుడు:**

( కుచేలుని యెగాదిగా చూస్తూ )

ఆయన్ని యెరుగని వాళ్లెవరు? అయినా ...

మీారు ఆయన్ని చూడాలని వచ్చారా... !

**కుచేలుడు:** ఆఁ... ! ఔను బాబూ ...! నిజం! అందుకే వచ్చాను!

"ఇందీవరశ్యాము వందిత సుత్రాము
గరుణాలవాలు భాసుర కపోలు
కౌస్తుభాలంకారు గామిత మందారు
సురుచిర లావణ్యు సురశరణ్యు
హర్యక్ష నిభమధ్యు నఖిలలోకారాధ్యు
ఘన చక్రహస్తు జగత్ప్రశస్తు
ఖగకులాధిపయాను కౌశేయ పరిధాను
బన్నగ శయను నబ్జాతనయను
మకరకుండల సద్భూషు మంజు భాషు
నిరుపమాకారు దుగ్ధసాగర విహారు
భూరి గుణసాంద్రు యదుకులాంబోధి చంద్రు"
*జిష్ణు గృష్ణుని జూడ వచ్చితిని నేను*

[ అది విని బ్రాహ్మణుడు విరగబడి నవ్వాడు. ]

**కుచేలుడు:** ఏం బాబూ...నే నేమన్నా తప్పు మాట అన్నానా?

**బ్రాహ్మణుడు:** అఁహాఁహాఁ...ఏం లేదు...యేం లేదు...!!

[ అంటూనే, అతను నిర్లక్ష్యంగా అక్కడినుంచి కదిలాడు. ]

**కుచేలుడు:** చూడండి...! ఆయన ... యిప్పు డెక్కడ ఉంటారు?

**బ్రాహ్మణుడు :**

( సానుభూతితో )

...బాబూ...! ఏమిటి యీ ప్రశ్న...? ఆయన ఫలానాచోట ఉంటాడు అని నే నెలా చెప్పేది? ఆయనకు పదహారువేల పైచిలుకు భార్య లున్నారు. ఒకొక్క భార్యకు పదిమంది చొప్పున పిల్లలున్నారు. ఆయనకు యెప్పుడు యెక్కడ ఉండాలనిపిస్తే అక్కడ ఉంటాడు. అంతే కాదు.

" సకలార్థ సంవేది యొకయింటి లోపల
జెలితోడ ముచ్చటల్ సెప్పుచుండు
విపుల యశోనిధి వేఱొక్క యింటిలో
సరసిజానన గూడి సరస మాడు
బుండరీకదళాక్షు డొండొక యింటిలో
దరుణికి హారవల్లరులు గ్రుచ్చు
గరుణా పయోనిధి మఱియొక యింటిలో
జెలి గూడి విడియము సేయుచుండు
వికచ కమలనయను డొకయింటిలో నవ్వు
బ్రవిమలాత్ము డొకట బాడుచుండు
యోగిజనవిధేయు డొకయింట సుఖగోష్ఠి
సలుపు ననఘు డొకట జెలగుచుండు!"

అలా అన్నామని, ఆయన, యెప్పటికప్పుడు ఒకే ఒక చోట ఉంటాడని చెప్పటానికి కూడా వీల్లేదు. ఆయన ఒకే సమయంలో అనేకచోట్ల ఆడుతూ పాడుతూ ఉండటంకూడా కద్దు. అదంతా ఆ మహానుభావుని చిద్విలాసం.

[ అది విన్న కుచేలుడు అమితమైన ఆనందాన్ని పొందాడు; కృష్ణయ్య తన కళ్లయెదుట ఉన్నట్టే తలపోశాడు; భక్తి పూర్వకంగా చేతులెత్తి నమస్కరించాడు. ]



## ★ 3. వ, రంగం ★

[ శ్రీ కృష్ణుడు రుక్మిణీదేవితో పాచిక లాడుతున్నాడు. అంతలో, అక్కడికి, ఒక పరిచారిక మెల్లగా వచ్చింది. ]

పరిచారిక: ...అమ్మా... అయ్యగారికోసం యెవరో వచ్చారు !

[ రుక్మిణీదేవి లేచి ఓ ప్రక్కగా నుంచుంది. అంతలో కుచేలుడు ప్రవేశించాడు. ]

కృష్ణుడు : ... ఓ... నువ్వా ?... రా...రా...!!

[ అంటూనే, కృష్ణయ్య, కుచేలునికి యెదురు వెళ్లాడు. వెళ్లి, అమితమైన ఆదరభావంతో అతణ్ణి ఆలింగనం చేసుకున్నాడు. లోపలకు తీసుకువచ్చాడు. తన మంచంమీద, తన ప్రక్కగా కూర్చోబెట్టుకున్నాడు. రుక్మిణీదేవి, అదంతాచూసి ఆశ్చర్యపోయింది. కృష్ణయ్య అది గ్రహించాడు. అందుకనే .. ]

ఈయన యెవరో తెలుసా ? నా ప్రాణస్నేహితుడు ; కుచేలుడు !

[ రుక్మిణీదేవి 'ఓ...అలాగా?' అన్నట్టు చూసింది; కుచేలునకు నమస్కరించింది. కుచేలుడు ఆమెకు ప్రతినమస్కారం చేశాడు. చేసి, కృష్ణయ్య నుద్దేసించి ... ]

కుచేలుడు: ... ఈవిడ ...

కృష్ణుడు : ( చిరునవ్వుతో )

నీ మఱదలు...! విదర్భరాజు కూతురు ! మహామహులెందరినో కాదని మనయింటికి వచ్చింది !

[ రుక్మిణి ముసిముసి నవ్వులు నవ్వుతూ ప్రక్కగా వెళ్ళింది. అది చూసిన కృష్ణయ్య పకపకలాడాడు. కుచేలుడు మంద హాసం చేశాడు. మరికొంతసేపటికి, రుక్మిణి, ఒక బంగారు కలశంతో ప్రవేశించింది.

ఆ వెంటనే ఒక పరిచారిక ఒక పైడిపళ్లెం తెచ్చి కుచేలుని ముందు ఉంచింది. రుక్మిణీదేవి సహాయంతో కృష్ణయ్య అందులో కుచేలుని పాదాలు కడిగాడు.

అంతలో మరొక పరిచారిక సుగంధం ఉన్న పాత్రను తెచ్చి రుక్మిణీదేవికి అందించింది. కృష్ణయ్య అందులోని సుగంధాన్ని తీసుకుని కుచేలుని ఒంటినిండా రాచాడు.

ఆ తరువాత మరొక పరిచారిక హారతిపళ్లెం తీసుకు వచ్చింది. రుక్మిణీ కృష్ణులు కుచేలునకు హారతినిచ్చారు.

మరి కొందరు పరిచారికలు అందించిన పూలమాలలతో కృష్ణయ్య కుచేలుని అలంకరించాడు. అతణ్ణి అమితమైన అభి మానంతో ఆలింగనం చేసుకున్నాడు.

అంతలో రుక్మిణీదేవి, ఒక బంగారపు గిన్నెనిండా పాలు పోసి తీసుకు వచ్చింది. కృష్ణయ్య ఆ గిన్నెను కుచేలునికి అందించాడు. కుచేలుడు జంకుతూ జంకుతూనే అందులో ఉన్న పాలన్నీ త్రాగేశాడు.

ఆ విధంగా ఆతిథి సత్కారాన్ని పూర్తిచేసి, కృష్ణయ్య కుశల ప్రశ్నల కుపక్రమించాడు. వారు అలా మాట్లాడు కుంటూ ఉండగా, రుక్మిణీదేవి ఒక విసనకఱ్ఱ తీసుకుని వారికి విసురుతూ నుంచుంది. ]



# ★ 4. వ, రంగం ★

[ అదే మందిరంలో మరొకచోట యిద్దరు పరిచారికలు ముచ్చటించు కుంటున్నారు. ]

పరిచారిక :

1. ఊహూఁ! క్రిందటి జన్మలో యీాయన యేం తపస్సు చేశాడో యేమో ?

2. ఏమీ చెయ్యకపోతేనే యింత అదృష్టం పడుతుందా ?

3. మాధవుడే ఆయనకు మర్యాద చేస్తున్నాడూ అంటే...

4. ఆయన కూడా ఒక మహానుభావుడే అయి వుండాలి !

3. ఇంకా సందేహమా ?

5. ఊహూఁ! ధనహీనుడు కావచ్చు. పుట్టుదరిద్రుడని కూడా అనిపించుకోవచ్చు. అయితే యేం ? మాధవుని చేత మన్నింపబడుతున్నాడు !

4. అంతేనా...? శ్రీ మహాలక్ష్మి ఆయనకు స్వయంగా సేవ చేస్తోంది !

5. ... నిజంగా అదృష్ట మంటే అదృష్టం ఆయనదేనే !

3. ఇంకా నెమ్మదిగా అంటావేం ?

4. ...అందుకే మన వాళ్లు చెబుతారు ; 'మాధవుడు చూసేది మనసు కాని మడి మాన్యాలు కావు' అని.

[ 'ముమ్మాటికీ అంతే' అన్నట్టుగా ఆ పరిచారిక లందరూ తలలాడించారు. ఆ వెంటనే అక్కడినుంచి కదలివెళ్లారు. ]



## ★ 5. వ రంగం ★

[ కృష్ణయ్యా కుచేలుడూ కడుపుబ్బిపోయేటట్టు నవ్వు కుంటున్నారు. రుక్మిణీదేవి, ముసిముసి నవ్వులతో వారికి వింజామర వీస్తోంది. ]

రుక్మిణి: ... ఇంతకూ వీరు వెన్న దొంగలు మాత్రమే కారన్నమాట!

కుచేలుడు: ( చిలిపిగా నవ్వుతూ )

అబ్బే...! అసలు ఆయన చేసిన పనులన్నీ చెప్పాలీ అంటే...

కృష్ణుడు: కొంపదీసి అవన్నీ యేకరువు పెడతావా యేమిటి?

[ కుచేలుడు చిరునవ్వు నవ్వాడు; తలవంచుకున్నాడు. కృష్ణయ్య రుక్మిణీదేవివంక చిలిపిగా చూశాడు; ఆమె మంద హాసం చేసింది. ఆ వెంటనే, కృష్ణయ్య కుచేలుని ఉద్దేశించి . ]

... ఇంతకూ నాకు యేం తీసుకువచ్చావు ?

[ అది విన్న కుచేలుడు కొంచెంగా కలవరపడ్డాడు. ఆ వెంటనే, కృష్ణయ్య, ఆ ప్రక్కన ఉన్న కుచేలుని ఉత్త రీయం వంక చూశాడు. చూడగానే, దాని చెంగున కట్టి ఉన్న మూట ఒకటి అతని కంటబడ్డది. అది చూసిన కృష్ణయ్య 'ఆc...దొరికింది!' అన్నట్టుగా తల ఆడించాడు. ఆ మూటను విప్పటం మొదలు పెట్టాడు.

అది విప్పటం తనకు యిష్టం లేనట్టుగా కుచేలుడు కృష్ణయ్యను వారింప బోయినాడు. అది గ్రహించిన రుక్మిణీ

దేవి, కొంచెం సిగ్గుతో, 'యీయన యెప్పుడూ యింతే!' అన్నట్టుగా తల త్రిప్పుకుంది. ]

...అమ్మదొంగా...! ఏదో తెచ్చావే!

[ అంటూనే ఒక్కొక్కముడే విప్పసాగాడు. ]

**కుచేలుడు:**

...ఏమీ లేదు...యేమీ లేదు !!

[ అంతలో కృష్ణయ్య ఆమూట విప్పాడు. అందులో అతనికి కొన్ని అటుకులు కనిపించినై. వెంటనే అతను వాటిల్లోంచి ఒక గుప్పెడు తీసుకున్నాడు. ]

**కృష్ణుడు:** ఏమీ లేదంటావేం...? యివేమిటి...?

[ రుక్మిణీదేవి కుచేలునివంక సానుభూతితో చూసింది. కుచేలుడు సిగ్గుతో తలవంచుకున్నాడు.

కృష్ణయ్య, ఆ గుప్పెడు అటుకులూ నోట్లో పోసుకుని గబగబా మ్రింగేశాడు. మరో గుప్పెడు తీసుకున్నాడు.]

**రుక్మిణి:** ...ఏమిటి యీ అల్లరి ?

**కృష్ణుడు:** అల్లరేముంది ? నా స్నేహితుడు నాకోసం తెచ్చాడు; నేను తింటున్నాను. ఇదీ అల్లరేనా ?

[ రుక్మిణీదేవి మందహాసం చేసింది. కుచేలుడు లజ్జతో క్రుంగిపోయినాడు. కృష్ణయ్య కుచేలుని వేపు తిరిగి ... ]

...నువ్వే చెప్పు...అసలు నేను అల్లరివాడినా?

**కుచేలుడు:**

( 'ఊఁహుఁ...కాదు!' అన్నట్టు తల ఊపి, రుక్మిణీ దేవితో...)

...ఈయన్ని యే మనటానికీ వీలేదమ్మా! ఈయన యే పనిచేసినా యిలాగే ఉంటుంది! ఈయనలో

తప్పుపట్టడం యెవరి తరమూ కాదు! అదీకాక, చిలిపి తనంపుట్టి శ్రీకృష్ణుడు పుట్టాడు; అసలు రహస్యం అది!

**రుక్మిణి:** ( చిలిపిగా )

ఓ...అలా చెప్పండి! ఆవిషయం యింత వరకూ నాకు తెలియనే తెలియదు!

**కృష్ణుడు:** ( లేనికోపాన్ని తెచ్చుకుని )

... తెలిస్తే, మహా ... యేం చేసేదానివో?

[ అతనివంకచూసి, రుక్మిణీదేవి పొట్టఉబ్బిపోయేటట్టు నవ్వింది. కృష్ణయ్యకూడా ఆమెతో పాటు నవ్వాడు. వారిద్దరినీ చూస్తూ కుచేలుడు మందహాసంచేశాడు.

ఆ వెంటనే, కృష్ణయ్య, చేతులోఉన్న అటుకులు నోట్లో పోసుకోబోయినాడు. అది చూసిన రుక్మిణీదేవి అతని చెయ్యిపట్టుకుంది; అవి నోట్లో పోసుకోకుండా ఆపింది. ]

**రుక్మిణి:** ... ఇదంతా ఆకలేనా... ?

**కృష్ణుడు:** ఆకలి అయినా కాకపోయినా, ఆప్యాయతతో తెచ్చినప్పుడు అంతా తినెయ్యాలిసిందే!

**కుచేలుడు:**

( కలవంచుకునే )

అమృతం త్రాగేనోటికిఅటుకు లెలా రుచిస్తున్నయ్యో అర్థం కాకుండా ఉంది!

**కృష్ణుడు:** అదేమిటి? అదీ యిదీ అన్న భేదం మనకు యెప్పుడూ లేదే!

"దళమైన బుష్పమైనను
ఫలమైనను సలిలమైన బాయని భక్తిం
గొలిచిన జను లర్పించిన
నెలమిఁ రుచిరాన్నముగనె యేను భుజింతుఁ"

[ కుచేలుడు సంతృప్తితో కృష్ణయ్య వంకచూశాడు. ]

**రుక్మిణి:** ...దానికైనా ఒక హద్దు అనేది ఉండాలిగా!

"సొంపారగ నితనికి బహు
సంపద లందింప నివియ చాలును నిక భ
క్తింపగ వలవదు త్రిజగ
త్సంపత్కర దేవదేవ సర్వాత్మ హరీ"

[ కుచేలుడు రుక్మిణీదేవివంక భక్తిపూర్వకంగా చూశాడు. ఆది గ్రహించిన కృష్ణయ్య మందహాసం చేశాడు. చేతులో ఉన్న అటుకులు అలాగే మూటలో వదిలేశాడు. ]



## ★ ౧. వ్రరంగం ★

[ కథకుడు ఆ తరువాత జరిగినవిషయం చెబుతున్నాడు. ]

**కథకుడు:** ... ఆ విధంగా, కృష్ణయ్యతో ఆరోజు గడిపి, కుచేలుడు, మరునాడు ఉదయాన తన ఊరికి ప్రయాణమైనాడు.

అప్పటికే శ్రీకృష్ణుని కరుణారసదృష్టి అతని కుటుంబంమీాద ప్రసరించింది. అతని యిల్లు ఒక రాజ మందిరంగా మారిపోయింది. అందులో ఉద్యాన వనాలు, సరోవరాలు యెన్నో యేర్పాటయినై. ఇంటినిండా, దేవకన్యలమాదిరి దాసదాసీజనం తిరుగుతున్నారు. అతనిభార్య సాక్షాత్తు లక్ష్మీదేవి మాదిరి తయారయింది. వారి పిల్లలు యింటి నిండా కలకలలాడుతూ ఉన్నారు. అప్పుడు, ఆ యింట్లో యెక్కడ చూసినా ఆనందమే తాండ విస్తోంది.

అదంతా కుచేలునకు తెలియదు. అతను యథా ప్రకారంగా యింటికి తిరిగి వస్తున్నాడు. వస్తూ ... దారిలో ...



## ★ 7. వ్రంగం ★

[ కుచేలుడు ఒకచెట్టు క్రింద విశ్రాంతి తీసుకుంటున్నాడు. ]

కుచేలుడు: " నా పుణ్య మరయ నెట్టిదో
యా పుణ్య నిధిం బ్రశాంతు నచ్యుతు నఖిల
వ్యాపకు బ్రహ్మణ్యుని జి
ద్రూపకు బురుషోత్తముని బరుం గను గొంటిన్ "
నిజంగా స్నేహితుడంటే స్నేహితుడు శ్రీకృష్ణుడే అని చెప్పాలి! ఆహాహా... ఆయనెక్కడ... నే నెక్కడ? ఆయన నన్ను గౌరవించటమా? ఆయనే స్వయంగా నాకు సేవ చేయటమా?

... ఉఁహుఁ! ఇంతచేసి కూడా, 'నువ్వు యెలా ఉన్నావు?' అనిగాని, 'యేంచేస్తున్నావు?' అనిగాని ఆయన నన్ను అడగలేదు. అసలు విషయం చెప్పుకునే అవకాశం కూడా ఆయన నాకు యివ్వలేదు. అయినా, నాపిచ్చి కాకపోతే, ఆయనకు అర్థంకాని దేముంటుంది?

" శ్రీ నిధి యిట్లు నన్ను బచరించి ఘనంబున
విత్తమేమియు
న్నీని తెఱంగు గానబడె నెన్నదరిద్రుడు
సంపదంధుడై
కానక తన్ను జేరడని కాక శ్రితార్తి
హరుండు సత్కృపాం
భోనిధి సర్వవస్తు పరిపూర్ణునిగా నను
జేయకుండునే "

[ ఆమాట అనుకుంటూనే కుచేలుడు అక్కడనుంచి బయలుదేరాడు. ]



## ★ 8. వ, రంగం ★

[ ఆది కుచేలుని ప్రాసాదం. అక్కడ పంచపాళిలో నుంచుని కుచేలుని కొడుకులు వీథివేపు చూస్తున్నారు. అంతలో కుచేలుడు అక్కడకు వచ్చాడు. ]

**బాలుడు :** 1. ...అరుగో...నాన్నగారు!

**మిగిలినవాళ్లు :**

ఆఁ ఆఁ! వస్తున్నారొస్తున్నారు!... నాన్నగారొస్తున్నారు!

[ ఆ మందిరం ముందు నుంచుని కుచేలుడు 'ఇదేమిటి, నేను దారితప్పి యిక్కడికి వచ్చానా?' అన్నట్టు విచిత్రంగా చూస్తున్నాడు. అంతలో యిద్దరు పరిచారికలు అతణ్ణి సమీపించారు. ]

**పరిచారికలు :**

... దయచెయ్యండి ... దయచెయ్యండి!!

[ కుచేలుడు వారి వంక అదో విధమైన ఆశ్చర్యంతో చూడసాగాడు. అలాగే మౌనంగా వారి ననుసరించి లోపలకు వెళ్లాడు. ]



## ★ 9. వ్రంగం ★

[ ఆ యింటి సింహద్వారంలో కుచేలుని భార్య నుంచుని ఉంది. పరిచారికలు హారతి పళ్లేరాన్ని పట్టుకుని ఆమె ప్రక్కగా నిలబడి ఉన్నారు.

అంతలో కుచేలుడు ప్రవేశించాడు. తన భార్యను చూశాడు. తన కళ్లను తానే నమ్మలేక పోయినాడు.

ఆ వెంటనే, దాసీల సహాయంతో, ఆ యిల్లాలు కుచేలుని పాదాలు కడిగింది. అతనికి హారతి నిచ్చింది. పూలమాలతో అతణ్ణి అలంకరించింది.

అంతలో అతని పిల్లలందరూ అక్కడకు వచ్చారు. కుచేలుడు, మందహాసంతో, వారిని పలుకరించాడు. ఆపైన వారందరూ లోపలకు వెళ్లారు. ]



## ★ 10. వ రంగం ★

[ అది ఉద్యానవనంలో ఒక భాగం. అక్కడున్న పూల ఉయ్యేలలో కుచేలుడు కూర్చుని ఉన్నాడు. అతని భార్య అతని ప్రక్కనే ఉంది.

అంతలో కుచేలుని కడసారికొడుకు అక్కడకు పరుగెత్తు కుంటూ వచ్చాడు. ]

**పిల్లవాడు:** ... నాన్నగారూ ...! నాన్నగారూ ...! నాకు కూడా వచ్చిందండీ ... !

**కుచేలుడు :**

( అతణ్ణి చేతుల్లోకి తీసుకుని )

... ఏమిటి నాయనా ! ఏమిటది ?

**పిల్లవాడు:** అదేనండీ ... అన్నయ్యలు చదువుతారే ... అదే ... !

**కుచేలుడు:** ఓ...! ఏదీ...చెప్పు; చూద్దాం !

**పిల్లవాడు:** ( క్రిందికిదిగి చేతులు కట్టుకుని )

"హరిభజియించు హస్తములు
హస్తము, లచ్యుతు గోరి మ్రొక్కు త
చ్ఛిరము శిరంబు, చక్రధరు
చేరిన చిత్తము చిత్త మిందిరా
వరు గను దృష్టి దృష్టి, ముర
వైరి నుతించిన వాణి వాణి, య
క్షరు కథ లాను కర్ణములు
కర్ణములై విలసిల్లుబో భువిన్"

**కుచేలుడు:** ...భేష్...భేష్...! చాలా బాగుంది! ఇంకోటి చెప్పనా...?

[ ఆ సమయానికి పిల్లలందరూ అక్కడకు చేరుకున్నారు. ]

**పిల్లలు:** ఆఁ ఆఁ...చెప్పండి...నాన్నగారూ...! చెప్పండి!!

**కుచేలుడు:** " నగుమొగమున్, సుమధ్యమును,
నల్లని మేనును లచ్చికాట ప
ట్టగు నురమున్, మహాభుజము
లంచితకుండల కర్ణముల్, మదే
భగతియు, నీలవేణియు, కృ
పారస దృష్టియు గల్గు వెన్ను డి
మ్ముగ బొడసూపుగాత కను
మూసిన యప్పుడు విచ్చినప్పుడున్ "

[ కుచేలుడు ఒక్కొక్కమాటే చెబుతూ పిల్లలచేత అని పించాడు. చివరకు వారందరూ చేతులెత్తి భక్తితో నమస్క రించారు. ]



## ★ ముఖ్యపాత్రలు ★

1. దేవకీదేవి
2. రోహిణి
3. కృష్ణయ్య
4. బలరాముడు
5. ఇంద్రసేనుడు



# మాతౄణం

## ★ 1. ప్రరంగం ★

[ అది ద్వారకా నగరంలో దేవకీదేవి మందిరం. అక్కడ దేవకీదేవీ రోహిణీ కూర్చుని ఉన్నారు. రోహిణి యేదో దీర్ఘంగా ఆలోచిస్తూ ఉంది. ]

**రోహిణి:** ... అక్కయ్యా... !

**దేవకి:** ... ఏమమ్మా ?

**రోహిణి:** ( సందేహిస్తూ )
నాకో చిన్న ఆలోచన వచ్చిందమ్మా !

**దేవకి:** ( చిరునవ్వుతో )
... ఏమిటది ?

**రోహిణి:** ... ఒకప్పుడు మన కృష్ణయ్య ఓ విచిత్రమైన పని చేశాడు.

**దేవకి:** ( చిలిపిగా నవ్వుతూ )
అసలు విచిత్రంగా ఉండని పని ఆయన యేం చేశాడు ?

**రోహిణి:** అది కాదక్కయ్యా ! కాశీలో ఉన్నప్పుడు...గురు దక్షిణ క్రింద ...

**దేవకి:** ఆఁ ఆఁ ! మరణించిన ఆయన కుమారుణ్ణి మళ్లీ ఆయన కిచ్చాడు. అదేనా ?

రోహిణి: ఆఁ...అదే అదే...! గుర్తుందిగా?

దేవకి: అయ్యో...లేకేమమ్మా...?అది మరచిపోదా మను కున్నా మరపుకొచ్చే పనేనా? అయినా, ఆపని చేసింది ఆయన ఒక్కడే కాదు; ఆయన అన్నగారుకూడా అప్పుడు ఆయనతోనే ఉన్నారు!

రోహిణి: ఆఁ ... వాడి దేముందిలే!

దేవకి: ( చిరునవ్వుతో )
ఊఁ! ఇంతకూ అసలు విషయం...

రోహిణి: అదే చెబుతున్నాను. గురు ఋణం తీర్చుకున్నట్టే తల్లి ఋణంకూడా తీర్చుకుంటే...

[ ఆమాట వినగానే దేవకీదేవి కళ్లల్లో నీళ్లు తిరిగినై. ఆమె అమితమైన బాధతో నిట్టూర్చింది. అది గ్రహించిన రోహిణి, మనసు చిన్నబుచ్చుకుంది. ]

... అనవసరంగా బాధపెట్టాను కాబోలు!

దేవకి: ఆఁ హాఁ హాఁ; ఏంలేదమ్మా...! ఏంలేదు!

[ వారలా ముచ్చటించుకుంటూ ఉండగానే, బలరామ కృష్ణులు అక్కడకు వచ్చారు. బలరాముడు వారివంక చూసి కొంచెం కలవరపడ్డాడు. అది గ్రహించిన కృష్ణయ్య మందహాసం చేశాడు.

పిల్లలను చూడగానే ఆ తల్లులు కన్నీరు తుడుచుకున్నారు. అంతలో బలరామకృష్ణులు వారిని సమీపించి, వారి పాదాలు తాకి కళ్లకద్దుకున్నారు; వారి ప్రక్కగా కూర్చున్నారు. ]

రోహిణి: ...ఇప్పుడే, అమ్మా నేనూ మీ విషయం అనుకుం టున్నాం!

కృష్ణుడు: మా విషయమా? ఏమని?

**దేవకి:** పిన్ని కి ఓ చిన్ని కోరిక కలిగింది!

[ బలరాముడు 'అదేమిటి' అన్నట్లుగా తన తల్లివంక చూశాడు. ]

**కృష్ణుడు:** ఊఁ...! అదేమిటో చెప్పిందా?

**దేవకి:** చెబితేయేం...మళ్లీ చెబుతుంది; అడిగి చూడు!

**కృష్ణుడు:** ( రోహిణిని ఉద్దేశించి )

...ఏమిటి పిన్నీ...అది? నాకు చెప్పవ్?

**రోహిణి:** నీకు తెలియనిదేముంది నాయనా?

**కృష్ణుడు:** ...అదేమిటమ్మా ...? ఏదైనా చెప్పందే యెలా తెలుస్తుంది?

[ బలరాముడూ దేవకీ ఒకరివంక ఒకరు చూసుకున్నారు. చిరునవ్వు నవ్వుకున్నారు. ]

**రోహిణి:** ... మీ ఆరుగురు అన్నయ్య లుండే వాళ్లు; తెలుసుగా!

[ ఆ మాట వినగానే దేవకీదేవి ముఖంలో అదోవిధమైన బాధ కనిపించింది. ఆమె వెంటనే తలవాల్చుకుంది. కృష్ణయ్య 'ఆఁ ఆఁ' అంటూ తల ఆడించాడు. ]

... ఆ ఆరుగురినీ మీ మామయ్య ...

**కృష్ణుడు:** ( సానుభూతితో )

... ఔను. అదంతా అమ్మ ఓసారి చెప్పింది.

**రోహిణి:** సరే ... యిక చెప్పేదేముంది? వాళ్లనలా బలి చెయ్యటమేనా అని!

[ బలరాముడు కృష్ణయ్య వంక సాభిప్రాయంగా చూశాడు. ]

**కృష్ణుడు:** వాళ్లు కారణజన్ములమ్మా! ఒక పని మీద వచ్చారు; అది పూర్తికాగానే వెళ్లిపోయినారు. వాళ్లను... మళ్లీ ...

**రోహిణి:** మానవ లోకంలో పడేయాలని మా కోరిక కానే కాదు, నాయనా!... అయినా అవకాశం దొరికితే, ఒకసారి వాళ్లను చూడాలని ఉంది; అంతే!

**కృష్ణుడు:** ...దానికేం?...అలాగే!

[ దేవకీదేవి కృష్ణయ్యను ఆదరంతో దగ్గరకు తీసుకుంది; అతని మెడను చుట్టేసుకుంది.

అది చూసిన బలరాముడు సానుభూతితో ఆమెవంక చూశాడు.

రోహిణి ఆనందబాష్పాలు రాల్చింది. ]



## ★ 2. వ రంగం ★

[ అది సుతలాధిపతి అయిన ఇంద్రసేనుని మందిరం. కృష్ణ బలరాములు అక్కడకు వచ్చారు. ఇంద్రసేనుడు వారికి యెదురువెళ్లి సాష్టాంగ పడ్డాడు. కృష్ణయ్య అతణ్ణి ఆదరంతో లేవనెత్తాడు. ]

ఇంద్రసేనుడు:

" ......నమో భగవతే హార
యే పరమాత్మనే ముకుం
దాయ సమస్త భక్త వర
దాయ నమః పురుషోత్తమాయ కృ
ష్ణాయ మునీంద్ర వంద్య చర
ణాయ సురారిహరాయ సాంఖ్య యో
గాయ వినీల భాస్వ దల
కాయ రథాంగధరాయ వేధసే!!"

[ శ్రీకృష్ణుడు అతణ్ణి దగ్గరకు తీసుకున్నాడు. ఆపైన ఇంద్రసేనుడు కృష్ణ బలరాములకు ఉచితాసనాలు చూపించాడు. తను వారి పాదాల దగ్గర కూర్చున్నాడు. ]

" కంటి గంటి భవాబ్ధి దాటగ
గంటి ముక్తి నిధానమున్
గంటి నీ కరుణావలోకము .
గంటి బాపము వీడ ము

కన్గొంటి తామర చూలియుం బొడ
గానన్నట్టి మహాత్మ నా
యింటికిం జనుదెంచి తీశ్వర
యే గృతార్థత బొందితిన్ "

... మహాత్మా! మీరు యిలా విచ్చేయటంవల్ల నా జన్మ తరించింది! వచ్చిన పనేమిటో సెలవిస్తే సంతోషిస్తాను!

**కృష్ణుడు:** ఇంద్రసేనా...! అసలుకథ చెప్పమంటావా!

**ఇంద్రసేనుడు:**

... చిత్తం. సెలవివ్వండి!

**కృష్ణుడు:** (చిలిపిగా నవ్వుతూ)

... అనగనగా ఓ రాజుండేవాడు. ఆయన పేరు మరీచి. ఆయనకు వర్ష అనే ఓ భార్య ఉండేది. ఆ దంపతులకు ఆరుగురు కొడుకులు పుట్టారు. ఆ ఆరుగురూ ఒకప్పుడు ఒక చిన్న తప్పుచేశారు. దానిమీద, బ్రహ్మకు బ్రహ్మాండమైన కోపం వచ్చింది. వచ్చి, 'మీరు రాక్షసులై పుట్టండి!' అని, వాళ్లను శపించాడు.

**ఇంద్రసేనుడు:**

... అయ్యో పాపం!

**కృష్ణుడు:** ( చిరునవ్వుతో )

... సొంతంగా వినకుండా సానుభూతి చూపిస్తే అయిపోతుందా ?

**ఇంద్రసేనుడు:**

ఆఁ ఆఁ...ఆ తరువాత... ?

**కృష్ణుడు:** ఆ శాపంవల్ల వాళ్లు మీ ముత్తాత అయిన హిరణ్యకశిపునికి పుట్టారు.

**ఇంద్రసేనుడు:**

( సంతోషంతో )

...ఆఁ...! అలాగా...?

**కృష్ణుడు:** ...అంతలో, దేవతలకు, వాళ్లతో ఒక చిన్న పని కలిగింది. అందుకని, యోగమాయ వాళ్లను తీసుకు వచ్చి దేవకీదేవి కడుపున పడేసింది.

**ఇంద్రసేనుడు:**

... ఇదేదో విచిత్రంగా ఉందే !

**కృష్ణుడు:** ...ఇప్పుడు చెప్పు...! వాళ్లు మాకు యేమౌతారు?

**ఇంద్రసేనుడు:**

( అమాయికంగా )

... అన్న లన్న మాట !

కృష్ణుడు: ఆఁ...! వాళ్లు మాకు అన్నలై పుట్టారు. కాని, వాళ్లు పెరిగి పెద్దవాళ్లు కాకముందే కంసుడు వాళ్లని చంపేశాడు.

ఇంద్రసేనుడు:

హరి హరీ...!

కృష్ణుడు: ... అది జరిగి చాలా కాలమయింది. అయినా, మా అమ్మకు వాళ్లమీద మమకారం పూర్తిగా పోలేదు. అందుకనే వాళ్లను చూడాలన్న కోరిక ఆ విడకు కలిగింది.

ఇంద్రసేనుడు:

... అందులో తప్పేముంది ?

కృష్ణుడు: ...అందుకనే మే మిక్కడికి వచ్చాం!

( ఆ ప్రక్కనే ఉన్న యువకులను చూపుతూ )

...అరుగో...వాళ్లే ఆ అన్నదమ్ములు!

[ ఆ మాట వినగానే ఆ ఆరుగురు యువకులూ ముందుకు వచ్చారు. కృష్ణబలరాములు వారికి యెదురువెళ్లి ప్రేమతో కౌగిలించుకున్నారు. ]

బలరాముడు:

...దీనితో కథ అయితే కంచికి వెళ్లింది ; కాని మేము మాత్రం యింకా యిక్కడే ఉన్నాం !

[ అదివిన్న కృష్ణయ్య మందహాసంచేస్తూ ఇంద్రసేనునివంక చూశాడు; చూసి .. ]

**కృష్ణుడు:** అమ్మ కోరిక తీర్చటానికి అన్నయ్య తొందర పడుతు న్నాడు !

**బలరాముడు:** (చిరునవ్వుతో)

అమ్మ కోరిక తీర్చాలనే కాదు; వీళ్లకు వీలున్నంత తొందరగా శాప విముక్తి కలిగించాలని కూడాను!

[ అది విన్న ఆ యువతులు బలరామ కృష్ణుల వంక కృతజ్ఞతతో చూశారు. ఇంద్రసేనుడు 'పురాణపురుషా!' అంటూ కృష్ణయ్య కాళ్లకు చుట్టేసు కున్నాడు. బలరామ కృష్ణులు మందహాసం చేశారు. ]



# ★ 3. ప్రరంగం ★

[ అది దేవకీదేవి మందిరం. దేవకీ రోహిణీ పూలమాలలు తయారు చేస్తున్నారు. ]

**రోహిణి:** ...అబ్బాయిలు యీ పాటికివస్తూ ఉంటారు!

[ దేవకీదేవి కావచ్చు నన్నట్టుగా తల పంకించింది. ]

ఆయినా, వాళ్ళని యిప్పుడు నువ్వు గుర్తు పడతావా అక్కయ్యా?

**దేవకి:** ( నవ్వి )

అదేమిటమ్మా? ఏ తల్లి అయినా పిల్లలను మరచి పోతుందా?

[ అంతలో కృష్ణ బలరాములు తమ అన్నలతో సహా ప్రవేశించారు. ఆ పిల్లలు 'అమ్మా! అమ్మా!' అంటూ ముందుకు ఉరికి వెళ్ళి, దేవకీ దేవిని పెనవేసుకున్నారు.

అది చూసి, రోహిణీ, బలరామకృష్ణులూ ఆనందబాష్పాలు రాల్చారు. ]



## ★ ముఖ్యపాత్రలు ★

1. శిశుపాలుడు
2. శ్రీకృష్ణుడు
3. సహదేవుడు
4. భీష్ముడు



# వైకుంఠ యాత్ర

## ★ 1. వ, రంగం ★

[ ఒక కథకుడు కృష్ణార్జునుల వైకుంఠయాత్రకు సంబంధించిన గాథ చెబుతున్నాడు. ]

**కథకుడు:** ...కుశస్థలీ పురంలో ఒకానొక బ్రాహ్మణు డుండే వాడు. అతనికి యేడుగురు కొడుకులు పుట్టారు ; కాని, యేడుగురూ పుట్టగానే చచ్చి పోయినారు.

పుట్టిన బిడ్డ లందరూ పురిటిలోనే పోతూఉండటం వల్ల ఆ బ్రాహ్మణునికి అంతులేని ఆవేదన కలిగింది. ఆ ఆవేదనతోనే అతను ఆత్మపరీక్ష చేసుకున్నాడు ; తను తెలిసిచేసిన తప్పు యేదైనా ఉన్నదా అని. కాని, అటువంటి దేమీ అతనికి కనబడలేదు.

అప్పు డతనికి ఒక అభిప్రాయం కలిగింది. ఏమని ? ఆ దేశాన్ని పరిపాలించే రాజు అధర్మమార్గాన నడవ టమే అతని కష్టాలకు కారణమై ఉంటుందీ అని. అంతే. అత డా అభిప్రాయాన్ని బలపరచుకున్నాడు ; దాంతో బాధపడటం మొదలు పెట్టాడు.

అలా ఉండగా అతనికి మరో పిల్లవాడు కలి గాడు. అయితే యేం...? అతను కూడా పుట్టిన వెంటనే ప్రాణం వదిలాడు.

ఆ బ్రాహ్మణుడు అది భరించలేక పోయినాడు. అతని కడుపుమంట అతణ్ణి ఒక ఉన్మాదిగా తయారు చేసింది. ఆ వెంటనే అతను ఆ కుఱ్ఱవాని శవాన్ని తీసుకుని రాజమందిరం వేపు వెళ్లాడు. అక్కడ...



## ★ 2. వ్రంగం ★

[ రాజమందిరం ముందు నుంచుని బ్రాహ్మణుడు పిచ్చివాని మాదిరిగా అరుస్తున్నాడు. అతని కుమారుని శవం అక్కడే ఉంది. అతని చుట్టూ అంతులేనంతమంది మూగారు. అందులో చాలామంది అతనివంక సానుభూతితో చూడసాగారు. ]

బ్రాహ్మణుడు:
... ఇది ఊరుకాదు; వల్లకాడు. దీన్ని పాలించేవి రాజు కాదు; రాక్షసుడు. ఇక్కడ ధర్మం లేదు ...నీతిలేదు...నియమం లేదు ... శాంతిలేదు ... లేదు...లేదు ... యేమీలేదు ! ... ఉన్నదల్లా కడుపు మంట...! కార్చిచ్చు ! అంతే...అంతే...!!

[ అత నలా అరుస్తూ ఉండగానే అర్జునుడు అక్కడకు వచ్చాడు. వచ్చి, అతని అల్లరి చూశాడు. నిర్ఘాంతపోయి నిలబడ్డాడు. ]

అర్జునుడు: ...స్వామీ...! స్వామీ...!! ...ఏమిటి యీ అల్లరి ?

బ్రాహ్మణుడు: ( వికటంగా నవ్వి )
...ఇది అల్లరి కాదు బాబూ...ఆరని కడుపుమంట ! తీరని అన్యాయం ! దీనంతకూ మూలం యీ ప్రభువు !

[ అది విన్న అర్జునుడు చకితుడైనాడు. ]

ప్రభువు మంచివాడైతే ప్రజలిలా బాధపడతారా ? ప్రభువు ధర్మమూర్తి అయితే పసిపాప లిలా చచ్చిపోతారా ?...చూడండి...! మీరే చూడండి... !!

( శవంమీది గుడ్డను తొలగించి )

... వీడు ... వీడు ... యీ చిన్నారి ... యీ
కన్నారి ... నా కడుపున పుట్టాడు. పుట్టి నా కడుపు
చిచ్చు పెట్టాడు. ఇలా చేసింది వీడు ఒక్కడే కాదు
...వీడి అన్నలు కూడా యింతే! అందరూ ఇలాగే
చేశారు!

[ అర్జునుడు అతనివంక సానుభూతితో చూశాడు. ]

...నాకు తెలిసినంతవరకు...నేను యే పాపమూ
చెయ్యలేదు; యెవ్వరి కొంపా తియ్యలేదు. అయినా
యీ శిక్ష అనుభవిస్తున్నాను. ఆరని మంటతో
అహోరాత్రాలూ అటమటించి పోతున్నాను. దీనికి
మూలం యెక్కడుంది? ఎవరు చేసిన పాపానికి
నే నీ శిక్ష అనుభవిస్తున్నానో మీరే చెప్పండి!

[ అర్జునుడు యేదో ఆలోచన తట్టినట్టుగా తల ఆడించాడు. ]

...ఇక్కడ యెందరో మహానుభావు లున్నారుట!
ఎందరో వీరాధివీరు లున్నారుట! ఐతే మాత్రం
యేం లాభం? మృత్యు దేవతని యెదిరించే మొన
గాడు ఒక్కడైనా ఉన్నాడా అని! ఒక్కడంటే
ఒక్కడు...! ఊఁహూఁ! లేడు...!! మచ్చుకైనా
లేడు!!

[ అది విన్న అర్జునుడు వికటంగా నవ్వాడు. బ్రాహ్మణుడు
అతని వంక ఒక క్షణం సేపు వెఱ్ఱిగా చూసి అతని కంటె
విపరీతంగా నవ్వసాగాడు. ]

**అర్జునుడు:** ... నీ దృష్టిలో వీరుడే లేడన్న మాట!

**బ్రాహ్మణుడు:** (వికటంగా)

ఉన్నాడా...బాబూ వీరు డున్నాడా...? ఎక్క
డున్నాడు...? ఎక్క డున్నాడో చెప్పు బాబూ!

**అర్జునుడు:** ... ఎక్కడో కాదు...నీ ముందే ఉన్నాడు!

[ ఆ మాట విన్న బ్రాహ్మణుడు విపరీతంగా నవ్వాడు. అది చూసిన అర్జునుడు తనకది అవమానంగా భావించుకున్నాడు. కొంచెం చికాకు పడ్డాడు. ]

**బ్రాహ్మణుడు:**

... ఎవరుబాబూ ... నువ్వేనా ఆ వీరుడివి...? నువ్వో వీరుడివా నాయనా? నువ్వా...ఓ విలుకాడివేనా...?

[ ఆమాట అంటూనే అతను తిరిగి విరగబడి నవ్వాడు; అర్జునునికి అమితమైన కోపం వచ్చింది. ]

...నువ్వు ... బలుడివా ...? కాదు! మాధవుడివా ...? అసలే కాదు! పోనీ...ప్రద్యుమ్నుడివా అంటే...అదీ కాదు!

**అర్జునుడు:** ఊహూం...! విలుకాళ్లు ఆ ముగ్గురే నన్నమాట!

**బ్రాహ్మణుడు:** ( వికటంగా నవ్వి )

... అది నామాట కాదు నాయనా ... నలుగురూ అనుకునే మాట! ఇంతకూ ... నువ్వు ... అది కాదంటూ వన్న మాట!

**అర్జునుడు:** అనటమే కాదు ; అలా ఋజువు చేస్తానుకూడా!

**బ్రాహ్మణుడు:** ( కొంచెం విస్మయంతో )

ఆఁ ...! అలాగా బాబూ! అయితే నువ్వు ...

**అర్జునుడు:** నేను యెవ్వరైతే నీకేమిటి? అయినా అడిగావు కాబట్టి చెబుతున్నాను.

"బలుడంగాను, మురాసురాంతకుడ గా
ప్రద్యుమ్నుడం గాను నే
దెలియం దత్తనయుండ గా నని విరో
ధి వ్రాతముఁ భీషణో

జ్వాల గాండీవ ధనుర్విముక్త నిశితా
స్త్ర శ్రేణిచే బీస్గు బెం
టలు గావించు పరాక్రమ ప్రకట చం
డ స్ఫూర్తి నే బార్థుడన్"

**బ్రాహ్మణుడు:**

ఓ... నువ్వేనా బాబూ...! ఆ పార్థుడివి నువ్వేనా?

**అర్జునుడు:** ఊఁ హూఁ...!

"బలిమి పురాంతకుం దొడరి
బాహు విజృంభణ మొప్ప నెక్కటిం
దలపడి పోరినట్టి రణ
ధైర్యుని నన్ను నెఱుంగ వక్కటా
పెలుకుఱ మృత్యు దేవతను
బింక మడంచి భవత్తనూజుల
న్నలవుజలంబు జూపి కొని
యాడగ నిప్పుడ తెచ్చి యిచ్చెదన్"

**బ్రాహ్మణుడు:** ( సంతోషంతో )

...ఆఁ ఆఁ...! నిజంగానా ...? నీలో అంతశక్తి
ఉందా నాయనా ...?

**అర్జునుడు:** ఉన్నదని చెబితే యేం లాభం? అన్నమాట నెగ్గించు
కోలేకపోతే అగ్ని ప్రవేశం చేస్తాను...సరేనా?

**బ్రాహ్మణుడు:**

... భేష్ భేష్...! శౌర్య మన్నా, శపథ మన్నా
అలా ఉండాలి! ... అంతే ...! అంతే...!!

[ అంటూనే ఆ బ్రాహ్మణుడు అర్జునుని ఆలింగనం చేసు
కున్నాడు. ]



## ★ 3. వ్రరంగం ★

[ కథకుడు ఆ తరువాత జరిగిన గాథ చెబుతున్నాడు. ]

**కథకుడు:** అర్జునుని మాటలను ఆ బ్రాహ్మణుడు పూర్తిగా విశ్వసించాడు. అందుకనే ధైర్యంతో యింటికి వెళ్లాడు.

అలా కొంతకాలం గడిచింది. తిరిగి అతని భార్య ప్రసవించే రోజు వచ్చింది. అప్పుడు ...



## ★ 4. వ, రంగం ★

[ బ్రాహ్మణుడూ అర్జునుడూ ఒకచోట మాట్లాడు కుంటున్నారు. ]

**అర్జునుడు:** ఏం భయం లేదు; నే నున్నానుగా! అంతగా అవసర మైతే నీ పిల్లవాడి ప్రాణానికి నా ప్రాణాన్ని అడ్డు వేస్తాను. సరేనా?

[ అది విన్న బ్రాహ్మణునిలో సగం సంతోషమూ సగం సందేహమూ ఉన్నట్టు కనిపించింది. అలాగే ఆ యిద్దరూ ముందుకు సాగిపోయినారు. ]



# ★ 5. వ్రంగం ★

[ అది బ్రాహ్మణుని యిల్లు. ఆ యింటికి నాలుగు వేపులా బాణాలు పాతి ఉన్నై.

బ్రాహ్మణుడు ఓ మూల దిగాలుపడి కూర్చున్నాడు. అర్జునుడు గాండీవాన్ని ధరించి నుంచున్నాడు. ]

అర్జునుడు: ... స్వామీ ...! ధైర్యంగా ఉండండి! ఇంటిని శర పంజరం మాదిరి తయారు చేశాను. మృత్యు దేవత లోపలకు రావటం కాని, పుట్టిన పాపని ప్రాణం బయటకు పోవటం కాని జరగటానికి వీల్లేదు. ... ఇ దేమను కున్నారో ... గాండీవం! ఈశ్వర ప్రసాదం!

[ బ్రాహ్మణుడు లేని సంతోషాన్ని తెచ్చుకుని అక్కడి నుంచే అర్జునునికి నమస్కరించాడు.

అంతలో లోపలనుంచి, పసిపాప యేడుపు వినిపించింది. అది విన్న అర్జునుడు అమాంతంగా విల్లెక్కు పెట్టాడు.

ఆ వెంటనే 'అయ్యో అయ్యో ...! పోతున్నాడు ... పోతున్నాడు ... పిల్లవాడు యెగిరిపోతున్నాడు. అయ్యో అయ్యో.. !'' అన్న కేకలు వినిపించినై.

ఆ మాటలు చెవులో పడగానే బ్రాహ్మణుడు మూర్ఛ పోయినాడు. అర్జునుడు కలవరంతో అటూ యిటూచూశాడు. పైకి చూశాడు. తల వంకించాడు. నిట్టూర్చాడు. ]



## ★ 6. వ, రంగం ★

[ శ్రీకృష్ణుడు రుక్మిణీదేవి చుట్టియిచ్చే తములపాకు చిలుకలు అందుకుంటున్నాడు. అంతలో అర్జునుడూ బ్రాహ్మణుడూ అక్కడకు వచ్చారు.
కృష్ణయ్యను సమీపించిన అర్జునుడు తల వాల్చుకుని నుంచున్నాడు. బ్రాహ్మణుడు కృష్ణయ్యకు కొద్దిదూరంలో ఆగి, అతనికి సాష్టాంగ పడ్డాడు. ]

బ్రాహ్మణుడు:

"* వందిత చరణ * ముకుంద స
నందన మునివినుత నంద నందన పరమా
నంద శరదిందు చందన
కుంద యశస్సాంద్ర కృష్ణ గోవింద హరీ!"

కృష్ణుడు : ( అర్జునునితో )

ఎవరు బావా ; యీాయన యెవరు ?

[ అర్జునుడు నిట్టూరుస్తూ ప్రక్కనే ఉన్న ఒక ఆసనంలో కూలబడ్డాడు. ]

బ్రాహ్మణుడు:

పరమేశ్వరా ! నే నొక నిర్భాగ్యుణ్ణి. ఈ పౌరుష హీనుని ప్రలాపాలు నమ్మి, కన్న కొడుకును కోల్పోయి నాను. ఈ మహావీరుడు మృత్యు దేవతతో పోట్లా డుతా నన్నాడు. మరణించిన నా బిడ్డలను మళ్లీ నాకు యిస్తా నన్నాడు. ఇతని మాట లన్నీ నీటిమూాట లయినై. ఏం చేసేది ? నిన్నే నమ్ముకున్నాను.

నీ పాదాలనే ఆశ్రయించాను. ఇక నీటముంచినా పాలముంచినా నువ్వే !

కృష్ణుడు: ( విషయం గ్రహించినట్టుగా )

ఊఁ ... ! అంతేనా బావా ?

[ అర్జునుడు 'ఔ'నన్నట్టు తల పంకించాడు. ]

బ్రాహ్మణుడు:

... కృష్ణా !

" ఎక్కడి పాండు తనూభవు
డెక్కడి విలుకాడు వీని కెక్కడి సత్యం
బెక్కడి గాండీవము తన
కెక్కడి దివ్యాస్త్ర సమితి యేమన వచ్చున్"

[ ఆ మాటలు విన్న అర్జునుడు మనసు చిన్నపుచ్చుకున్నాడు. వెంటనే అక్కడనుంచి లేచి చరచరా బయటకు వెళ్లాడు.

కృష్ణయ్య మందహాసం చేస్తూ అర్జునునివంక చూశాడు. ]



## ★ 7. వ్రంగం ★

[ కథకుడు ఆ తరువాత జరిగిన గాథ చెబుతున్నాడు. ]

**కథకుడు:** ... ఆ విధంగా అక్కడ బయలుదేరిన అర్జునుడు సరాసరి యమలోకానికి వెళ్లాడు. బ్రాహ్మణుని కొడుకులు అక్కడ ఉన్నారేమోనని చూశాడు; కాని వాళ్లెవరూ అతనికి అక్కడ కనబడలేదు.

అక్కడి నుంచి బయలుదేరి అతను ఇంద్ర, అగ్ని, వరుణ, వాయు లోకాలన్నీ గాలించాడు. అక్కడా ఆ పిల్లల జాడ అతనికి తెలియలేదు.

ఆ తరువాత, తన యోగబలంద్వారా, అర్జునుడు...

"నర సుర యక్ష కింపురుష
నాగ నిశాచర సిద్ధ సాధ్య ఖే
చర విహగేంద్ర గుహ్యక పి
శాచ నివాసములందు రోసి భూ
సుర సుతు లేగినట్టి గతి
చొప్పడకుండుట జూచి క్రమ్మఱన్
ధరణికి నేగుదెంచి బెడి
దంబుగ నగ్ని సొరంగ బూనినన్"



## ★ 8. వ, రంగం ★

[ అగ్ని గుండంలో బయలుదేరిన మంటలు ఆకాశాన్ని అంటుకుంటున్నై. అర్జునుడు అక్కడే నుంచుని ప్రార్థన చేసుకుంటున్నాడు.

అంతలో శ్రీకృష్ణుడు అక్కడకు వచ్చాడు. వచ్చి, పరిస్థితి నంతనీ అర్థం చేసుకున్నాడు. అందుకనే గబగబా అర్జునుని సమీపించాడు ]

కృష్ణయ్య: ... బావా! ఏమిటి యీ అఘాయిత్యం?

[ అర్జునుడు అమాంతంగా కృష్ణుని కౌగిలించుకున్నాడు; కన్నీటిలో కరగిపోయినాడు. ]

... ఊఁ ...! బాగానే ఉంది! ఆ పొంగిపోవటం యెలా ఉందో యీ క్రుంగిపోవటం కూడా అలాగే ఉంది. ఉఁహుఁ! రా ...! నాతో రా...!

[ అంటూ, కృష్ణయ్య, అర్జునుని అవతలకు తీసుకువెళ్లాడు.]



## ★ 9. వ రంగం ★

[ కథకుడు ఆ తరువాత జరిగిన గాథ చెబుతున్నాడు. ]

**కథకుడు :** ... ఆ వెంటనే ఒక బంగారపు రథం మీద కృష్ణార్జునులు ప్రయాణమైనారు. వారు సప్త సముద్రాలూ దాటి, కులగిరులు దాటి, అలా అలా పైపైకి వెళ్లారు.

అంతలో వారికి చిమ్మ చీకటి యెదురయింది. శ్రీ కృష్ణుడు దాని మీదకు ఒక మహాస్త్రాన్ని వదిలాడు. ఆ అస్త్రం ఆ చీకటిని చిందర వందర చేసింది.

ఆ వెంటనే వారికొక దివ్యతేజం కనిపించింది. అర్జునుడు ఆ వెలుగును చూడలేక పోయినాడు; కొంచెంగా భయపడ్డాడు కూడా.

ఆ రథం అలా పోయి పోయి ఒక మహా సముద్రాన్ని చేరుకుంది. ఆ సముద్రం మధ్య ధగ ధగా మెరిసే వెయ్యి స్థంభాల మందిరం ఒకటి ఉంది. కృష్ణార్జునులు దాన్ని సమీపించారు.



# ★ 10. వ్రంగం ★

[ అది వైకుంఠం. అక్కడ శేషశాయి అయిన శ్రీమన్నారాయణుడున్నాడు. సునందాదులు ఆతనికి పరిచర్యలు చేస్తున్నారు. మునీశ్వరులు ఆయన్ని పరివేష్టించి ఉన్నారు.

అంతలో అర్జునుడూ శ్రీకృష్ణుడూ ఆయనను సమీపించారు; భక్తిపూర్వకంగా నమస్కరించారు.

**విష్ణువు:** ... కృష్ణా! మీరిక్కడకు యెప్పుడు వస్తారా అని మేం యెదురు చూస్తున్నాం. ఈ మునీశ్వరులు మిమ్మల్ని చూడాలని తహతహ లాడిపోతున్నారు.

**కృష్ణుడు:** ... నమో నారాయణాయ!

**విష్ణువు:** ( మందహాసంతో )

... మీరు ...

" ధరణికి ప్రేగగు దైత్యుల
బోరి బోరి వధియించి ధర్మముఁ నిలుపుటకై
ధర జనియించితి రిరువురు
నరనారాయణులనంగ నాయంశమునన్ "

[ కృష్ణార్జునులు తిరిగి విష్ణువుకు నమస్కరించారు. ]

" ఆరాధ నియతితో బెం
పారిన మిము నిమ్మునీంద్రు లర్థిం జూడం
గోరిన మీ వచ్చుటకై
ధారుణి సురసుతుల నిటకు దగ దేవలసెన్ "

... ఇదుగో ...! వీరే ... ఆ భూసుర కుమారులు!

[ అని ఓ ప్రక్కకు చూపగానే తొమ్మిదిమంది బ్రాహ్మణ కుమారులూ ముందుకు వచ్చారు; విష్ణుమూర్తికి అంజలించారు.

మునీశ్వరులు యేక కంఠంతో "నమో భగవతే వాసుదేవాయ! నరనారాయణాభ్యోనమః!" అని వారికి గౌరవం చూపారు. కృష్ణయ్య అర్జునుని వంక చూసి చిలిపిగా నవ్వాడు. ]



## ★ 11. ప్రరంగం ★

[ కుశస్థలి రాజద్వారం ముందు బ్రాహ్మణుడు నుంచుని ఉన్నాడు. కృష్ణార్జునులూ ఆ బ్రాహ్మణుని కుమారులూ అక్కడికి వచ్చారు. వారిని చూడగానే బ్రాహ్మణుడు పరిగెత్తుకుని వెళ్లి ఆ పిల్లలను ఆలింగనం చేసుకున్నాడు.

కృష్ణయ్య అర్జునుని చూసి మందహాసం చేశాడు. అంతలో ఆ బ్రాహ్మణుడు పశ్చాత్తాపంతో వారిని సమీపించి వారి పాదాలమీద వ్రాలాడు. 'పరమేశ్వరా ...! తండ్రీ !' అంటూ వ టిని చుట్టేసుకున్నాడు. ]



## ★ ముఖ్యపాత్రలు ★

1. శ్రీకృష్ణుడు
2. బలరాముడు
3. దుర్వాసుడు
4. విశ్వామిత్రుడు
5. సాంబుడు
6. బోయవాడు



# అవతార సమాప్తి

## ★ 1. వ, ర ం గ ం ★

[ ఒక కథకుడు కృష్ణావతార సమాప్తికి సంబంధించిన గాథను చెబుతున్నాడు. ]

**కథకుడు:** ఈ విధంగా ;...

"విదితుండై సకలామరుల్ గొలువ ను
ర్వీ భారమున్ మాన్ప దు
ర్మద సంయుక్త వసుంధరాధిపతులన్
మర్దించి, కంసాదులం
దుది ముట్టన్ వధియించి కృష్ణు డతి సం
తుష్టాత్ముడై యున్నచో
యదు సైన్యంబులు భూమి మోవగ
నసహ్యంబయ్యె నత్యుగ్రమై"

"ఈ రీతి శ్రీకృష్ణు డేపార పూతనా
శకట తృణావర్త సాల్వ వత్స
చాణూర ముష్టిక ధేను ప్రలంబక
దైత్యాఘ శిశుపాల దంతవక్త్ర

కంస పౌండ్రాదిక ఖండనం బొనరించి
యటమీద గురు బలం బడచి మఱియు
ధర్మజు నభిషిక్తు దనరగా జేసిన
నతడు భూపాలనం బమర జేసె

భక్తులగు యాదవేంద్రుల బరగ జూచి
యన్య పరిభవ మెఱుగ రీ యదువు లనుచు
వీరి బరిమాప్పనే దక్క వేఱొకండు
దైవమిక లేదు త్రిభువనాంతరమునందు"

అని శ్రీకృష్ణ భగవానుడు తనలో తాను విత
ర్కించు కుంటూ ఉన్నాడు. అంతలో ...



## ★ 2. వ్రంగం ★

[ అది ద్వారకానగరంలో శ్రీకృష్ణుని భవనం. కృష్ణుడు రుక్మిణీ సత్యభామా సమేతుడై తన విలాస మందిరంలో హంస తూలికా తల్పంమీద కూర్చుని ఉన్నాడు.

అక్కడకు విశ్వామిత్ర, అసిత, దుర్వాస, భృగు, అంగిరస, కశ్యప, వామదేవ, వాలఖిల్య, అత్రి, వసిష్ట నారదాది మునులు వచ్చారు. ]

**మునులు:** " తరణంబులు భవ జలధికి
హరణంబులు దురిత లతల కాగముల కా
భరణంబు లార్త జనులకు
శరణంబులు నీదు దివ్య చరణములు హరీ!"

[ శ్రీకృష్ణుడు వారివంక సాదరభావంతో చూశాడు. ]

" ఒక్కవేళను సూక్ష్మరూపము
నొందు దీ వణు మాత్రమై
యొక్కవేళను స్థూలరూపము
నొందు దంతయు నీవయై
పెక్కు రూపులు దాల్తు నీదగు
పెంపు మాకు నుతింపగా
నక్కజం బగుచున్న దేమన
నంబుజాక్ష రమాపతీ!"

**శ్రీకృష్ణుడు:** ( మందహాసంతో )
... మహర్షు లేదో పనిమీదే వచ్చినట్టున్నారు!

**మునులు:** ... మీ పాదపద్మాలను సందర్శించటం కంటె, మీ పవిత్ర నామాన్ని స్మరించటం కంటె మాకు మరో పనేముంది ?

[ కృష్ణయ్య, చిరునవ్వుతో, రుక్మిణీదేవి వంక చూశాడు. చూసి .. ]

**కృష్ణుడు:** ... మహర్షులకు మనమంటే యెంత అభిమానమో చూశావా ?

**రుక్మిణి:** ( మందహాసం చేస్తూ )

... మన మనుగడకు అదేగా ఆధారం !

[ మహర్షులు కృతజ్ఞతాభావంతో ఆ దివ్యదంపతుల వంక చూశారు. రుక్మిణీ కృష్ణులు ఒకరివంక ఒకరు ఓరగా చూసుకున్నారు. తలలు పంకించారు. వారి చేష్టల్లో అదో విధమైన గాంభీర్యత గోచరించింది. ]



## ★ 3. వ్రరంగం ★

[ అది ద్వారకా నగరానికి దగ్గరలో ఉన్న 'పిండారకం' అనే పుణ్యతీర్థం. అక్కడ గోపబాలురు కొందరు సాంబుడనే కుఱ్ఱవానికి చీరకట్టి అతణ్ణి ఒక స్త్రీ మూర్తిలా తయారు చేస్తున్నారు.

అంతలో మునులు అక్కడకు వచ్చారు. ]

గోపబాలుడు: 1.

...అరుగో ... మహర్షులిటే వస్తున్నారు !

[ సాంబుడు సిగ్గుపడి చీర విప్పుకోవటానికి ప్రయత్నించాడు. కొందరు గోపబాలురు అతణ్ణి వారించారు. ]

2. ... అరెరె ... ఏమిటిది ?

[ తిరిగి చీర చుట్టడం మొదలు పెట్టాడు. ]

గోపబాలుడు 1. వాళ్లవంక చూశాడు.

1. ... భేష్ భేష్ ... !

2. ఏమిటది ?

1. ... ముందు జరిగే విషయాలన్నీ మునులకు తెలుస్తై అంటారు కదూ ?

2. ఆఁ... ఆఁ ... !

3. అదే వాళ్ల గర్వం కూడాను !

1. అయితే, యిప్పుడో గమ్మత్తు చేద్దాం ... !

4. గడ్డ పయ్యాలతో గమ్మత్తా ...? ఒద్దు బాబూ ...ఒద్దు !

1. ప్చ్...పోరా! ప్రతిదానికీ భయమే?
4. వాళ్లను చూస్తే మహా మహా వాళ్లే భయపడతారు; నువ్వూ నేనూ ఓ లెక్కా?
3. ... అది కాదురా! ఇటు దటయిందనుకో; అప్పుడు ఆయన ఉండనే ఉన్నాడుగా!
4. ఎవరు ...? మన కృష్ణయ్యా?
3. ఆఁ ...! ఆయనే! ఆయనకు వీళ్లందరూ లోకువేగా!
4. ఉఁహూఁ! మీా తెలివి తెల్లారినట్టే ఉంది!
3. కాకపోతే యేమిటి? ఈ ముసలివాళ్లందరూ ఆయనముందు మోకరిస్తారు; అది నీకు తెలుసా?
4. అందుకనే వీళ్లంటే ఆయనకు అంతులేని అభిమానం. వీళ్ల మీాద యీాగ వాలినా ఆయన ఒప్పుకోడు! నీకు...అది తెలుసా?
1. ఊఁ ...! మహా చెప్పావ్ లేవోయ్!
అరేయ్ ...! మీారు నాతో రండి!
ఆ తరువాత పనంతా నేను చేస్తాను!

[ కొందరు పిల్లలు శమ కది యిష్టం లేనట్లుగా ఒకరివంక ఒకరు చూసుకున్నారు. మిగిలిన వాళ్లు వాళ్లని లక్ష్యం చెయ్యకుండా ముందుకు వెళ్లారు. వాళ్లతోపాటు స్త్రీ వేషంలో ఉన్న సాంబుణ్ణి కూడా తీసుకువెళ్లారు. ]



## ★ 4. ప్రరంగం ★

[ మునులు ఒక ప్రక్కనుంచి వస్తున్నారు. గోపబాలురు మరొక దిక్కునుంచి వాళ్లను సమీపించారు.

మునులను చేరుకోగానే, సాంబుడు, సిగ్గుతో తల వంచుకున్నాడు.

గోపబాలుడు 1. ఆ మునులను సమీపించి అతి వినయంతో నమస్కరించాడు. ]

**దుర్వాసుడు:**

ఏం నాయనా ...! ఏం కావాలి?

**గోపబాలుడు: 1.**

ఏమీ లేదు స్వామీ...! మాకు ఒక చిన్న సందేహం వచ్చింది!

**దుర్వాసుడు:**

సందేహమా? ... ఏమిటది?

**గోపబాలుడు: 1.**

( సాంబుని చూపుతూ )

అదుగో ... ఆ అమ్మాయిని చూశారా?

**దుర్వాసుడు:**

... ఆఁ ... !

**గోపబాలుడు: 1.**

ఆ అమ్మాయికి కొడుకు పుడతాడని కొందరూ, కాదు, కూతురే పుడుతుంది; అని మరి కొందరూ

వాదిస్తున్నారు. మీరు మహర్షులు. మీకు తెలియని దేమీ లేదు. చెప్పండి! ఇప్పుడు పుట్టబోయేది ...

[ చూస్తూ చూస్తూ ఉండగానే దుర్వాసుడు ఉగ్రుడై నాడు. అతని ముఖం జేవురించింది. ఆతని ప్రక్కనే ఉన్న విశ్వామిత్రుడు ఆ పిల్లల అల్లరి గ్రహించినట్టుగా తల పంకించాడు. దుర్వాసుని వంక చూశాడు. ]

**విశ్వామిత్రుడు:**

ఉఁహుఁ! వినాశకాలం వస్తేనే విపరీత బుద్ధులు పుడతై !

**దుర్వాసుడు:**

అంతే అంతే !

**గోపబాలుడు: 1.**

చెప్పండి బాబూ! తొందరగా చెప్పండి ! !

**దుర్వాసుడు:**

ఊఁ ... ! చెప్పక తప్ప దన్నమాట !

**గోపబాలుడు: 1.**

... చెప్పకపోతే మీ గొప్పతనం యేముంది ?

**దుర్వాసుడు:**

ఓ ... అలాగా ? ఐతే వినండి! ఆ కడుపులో యిప్పుడు ఒక ముసలం పుట్టబోతోంది !

[ అది విన్న మును లందరూ మొదట్లో పకపకలాడారు. కాని, ఆ వెంటనే అదో విధమైన ఆందోళన పాలైనారు. ]

... దాంతో, మీ వంశం అంతా నిర్మూలమై పోతుంది కూడా !

[ అది విన్న గోప బాలు రందరూ భయంతో ఒణికి పోయి నారు; ఒకరి వంక ఒకరు చూసుకున్నారు. ఆ వెంటనే, కొందరు పిల్లలు సాంబుని సమీపించి అతని చీర విప్పేశారు. అంతే! ఆ చీర మడతలలో నుంచి ఒక పెద్ద రోకలి బయట పడ్డది. అది చూసిన గోపబాలురు భయంతో కెవ్వున కేక పెట్టారు. ]

గోపబాలుడు:

4. ఊహుఁ! నేను చెబితే విన్నారా?

2. సరే ... యిప్పు డేం చేద్దాం?

3. చేసేదేముంది? మాట్లాడకుండా మోసుకు వెళ్లి దీన్ని మాధవునికి చూపటమే!

1. అంతే ... అంతే!

[ ఆ వెంటనే అందరూ కలిసి ఆ రోకలిని అతి కష్టంతో భుజాలకెత్తుకుని అక్కడనుంచి బయలుదేరారు. ]



## ★ 5. వ్ రంగం ★

[ శ్రీ కృష్ణుడూ బలరాముడూ కొలువు కూటంలో ఉన్నారు. వారికి రెండు ప్రక్కలా దేవతలూ, గరుడులూ, ఖేచరులూ, విద్యాధరులూ, బ్రహ్మ శివుడూ మొదలైనవాళ్లూ ఉచితాసనాలమీద కూర్చుని ఉన్నారు. ]

**బ్రహ్మ:** " అఖిల లోకేశ సర్వేశ యభవ నీవు
నుదయ మందుట భూభార ముడుపు కొఱకు
బంశ వింశోత్తర శతాబ్ద పరిమితంబు
నయ్యె విచ్చేయు వైకుంఠ హర్మ్యమునకు "

**కృష్ణుడు :** ( మందహాసం చేస్తూ )
అలాగే !

[ ఆ మాట అంటూనే శ్రీ కృష్ణుడు తన సింహాసనం మీదినుంచి లేచాడు. దేవ బృందం అంతా అతనికి నమస్కరించింది ; సెలవు తీసుకుని వెళ్లిపోయింది. ]

**బలరాముడు:** ఐతే ... మనవాళ్లందరినీ యేం చేసేటట్టు ?

**కృష్ణుడు :** ( చిరునవ్వుతో )
... ఒకరి నొకరు చేసేదేముంది ...? యెవరి దారి వాళ్లది !

**బలరాముడు:**
అంటే ... ?

**కృష్ణుడు:** ఏముంది ...? వీళ్లల్లో పరస్పర విద్వేషం పెంచితే సరి; వీళ్లే హరించి పోతారు !

[ బలరాముడు ఆలోచనలో పడ్డాడు. అంతలో గోప బాలురు ప్రవేశించారు. తాము మోసుకువచ్చిన ముసలాన్ని అతి జాగ్రత్తగా కృష్ణయ్యముందు పెట్టారు. ]

**కృష్ణుడు:** ... ఏమిటిది?

**గోపబాలుడు:**

1. ఇది సాంబునికి పుట్టింది!

4. వీళ్లు మహర్షులను హేళన చేశారు. దాని ఫలితంగా...

[ గోపబాలు రందరూ తలలు వంచుకుని నుంచున్నారు. కృష్ణయ్య ఒక క్షణంసేపు యేదో ఆలోచించాడు. ]

**కృష్ణుడు :** ఊఁ ...!

" మదిసెడి కన్నులు గానక
మదయుతులై మునుల గల్లమాటల జెనయం
గదిసి కులక్షయ కారణ
విదితంబగు శాప మొందు వెఱ్ఱులు గలరే "

**బలరాముడు:**

( భయంతో )

ఉఁహుఁ! కాలం సమీపించిం దన్నమాట!

**కృష్ణుడు:** అలాగే అనిపిస్తోంది.

" ధరణీ సుర శాపమునకు
హరిహర బ్రహ్మాదులైన నడ్డము గలరే
పరులనగ నెంత వారలు
గరమరుదుగ బూర్వజన్మ కర్మము బ్రోవన్ "

ఊఁహూఁ ! యతీశ్వరులను నిందించటం మూలంగా యదువంశం నాశనమవుతోం దన్న మాట ! ఎవరి కర్మలో యెంత ఉందో అంతా అనుభవించక తప్పు తుందా ?

( గోపబాలురతో )

... ఊఁ ... ! దీన్ని వెంటనే తీసుకువెళ్లండి. సముద్రం ఒడ్డున ఉన్న కొండకు మోది దీన్ని పొడి చెయ్యండి. ఆ పొడిని సముద్రంలో కలిపేయండి. ఆ తరువాత యేం కావాలో అది అవుతుంది; మనమేం చేస్తాం ?

[ గోప బాలురు అతి విచారంతో తిరిగి దాన్ని మోసుకు వెళ్లారు. ]



# ★ 6. వ రంగం ★

[ కథకుడు ఆ తరువాత జరిగిన గాథ చెబుతున్నాడు. ]

**కథకుడు:** ... అలా తీసుకు వెళ్లిన ముసలాన్ని గోపబాలురు పాషాణంమీద పగులగొట్టి సముద్రంలో పడేశారు. కాని, అందులో ఒక ఉక్కు తునుక ఉంది. వారు దాన్ని లక్ష్యం చేయలేదు; దాన్ని కూడా అందులోనే వదిలేశారు.

నీటిలో పడ్డ ఉక్కుముక్కను ఒక చేప మ్రింగింది. ఆ చేప, విధివశాత్తు ఒక బోయవానికి దొరికింది. ఆ బోయవాడు దాని కడుపులో ఉన్న ఆ ఉక్కుముక్కను చూసి, తీసి, తన బాణానికి ములికిగా వేసుకున్నాడు.

అదలా ఉండగా ...

శ్రీ కృష్ణ బలరాములకు అమితమైన దుశ్శకునాలయినై. బంగరు మేడల్లో కాకులూ గుడ్లగూబలూ అరవసాగినై. అశ్వశాలల్లో అకారణంగా అగ్ని పుట్టుకు వచ్చింది. భూమిలో అన్నం మొలిచింది. పక్షులు రాత్రిపూట కూడా కూయసాగినై. ఒక జాతి జంతువు కడుపున మరొకజాతి జంతువు పుట్టడం జరిగింది. ఇళ్లల్లో తామర పూవులు మొలిచినై. సూర్యుడు యెఱ్ఱగా కనిపించాడు.

అవన్నీ చూసిన కృష్ణయ్య, ఆ పైన ద్వారకలో ఉండటం మంచిది కాదని నిర్ణయించుకున్నాడు. ఆ వెంటనే, యాదవులందరినీ తీసుకుని ప్రభాస తీర్థానికి వలస వెళ్లాడు.

ప్రభాస తీర్థం చేరిన యాదవులు హద్దూ పద్దూ లేకుండా, కట్టుబాట్లు లెక్క చెయ్యకుండా సంచరించటం మొదలు పెట్టారు. వాళ్లు తప్పత్రాగి తిరిగే వాళ్లు. నిష్కారణంగా కలహాలు కల్పించుకుని ఒకరితో ఒకరు పోట్లాడుకునేవాళ్లు. అనవసరంగా యేనుగులనూ, గుఱ్ఱాలనూ కవ్వించి వాటితో మల్లుల మాదిరి పోట్లాడే వాళ్లు ; ఆ పోట్లాటల్లో మరణించే వాళ్లు.

అలా, యాదవు లందరూ మరణించిన తర్వాత, బలరాముడూ కృష్ణుడూ కూడా చీలిపోయినారు. బలుడు ఒంటరిగా పోయి పోయి యోగమార్గం ద్వారా విష్ణుమూర్తిలో కలిసిపోయినాడు.

చివరకు మిగిలింది శ్రీ కృష్ణు డొక్కడే. ఆయన, ఒక రోజున . . .



## ★ 7. వ్ రంగం ★

[ అది ప్రభాస తీర్థానికి దగ్గరలో ఉన్న ఒక అడవి. అక్కడ శ్రీ కృష్ణుడు ఒక చెట్టు నానుకుని నుంచున్నాడు; ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు.

ఆ చెట్టుకు ముందు ఒక పొద ఉంది. ఆ పొదకు ఆవతల నుంచి చూసే వాళ్లకు కృష్ణయ్య అరచేతులు లేడి చెవుల మాదిరిగా కనిపిస్తున్నై. ]



## ★ 8. వ, రంగం ★

[ ఆ అడవిలోనే ఒక బోయవాడు విల్లెక్కు పెట్టి నుంచు న్నాడు; కృష్ణయ్య ఉన్న పొద వేపుగా చూస్తున్నాడు. ]

**బోయవాడు:**

అబ్బ! ఏం బాగుంది! దాని చెవులే యింత లేతగా ఉన్నై... అదెంత కమ్మగా ఉంటుందో!

[ అంటూనే ఆ బోయవాడు గురిచూసి బాణం వదిలాడు. ఆ వెంటనే 'రామా!' అన్న ఆర్తనాదం అతనికి వినిపించింది. అది విన్న అతని గుండె ఝల్లుమన్నది. ఆ వెంటనే అతను ఆ శబ్దం వచ్చిన వేపుగా పరిగెత్తాడు. ]



## ★ 9. వ రంగం ★

[ పొద వెనుక ఉన్న కృష్ణయ్య అమితంగా బాధపడుతూ క్రమక్రమంగా ఒరిగిపోతున్నాడు. అంతలో బోయవాడు అక్కడకు వచ్చాడు; కృష్ణయ్యను చూశాడు. అంతే... నిలువునా నీరైపోయినాడు. ఆ వెంటనే, ఆయనను భుజంమీద వేసుకుని పొద ముందుకు తీసుకువచ్చి పడుకో పెట్టాడు. ]

**బోయవాడు:**

కృష్ణా...! కృష్ణా...! పరమేశ్వరా!!

[ అని ఆక్రందిస్తూ ఆయన మీద ఒరిగిపోయినాడు. ]

**కృష్ణుడు :** ...నాయనా...! లే...! లే బాబూ...! ఏడవకు! ఎవరి కర్మకు యెవరు కర్తలు? ఇందులో నువ్వు నిమిత్త మాత్రుడివి ... అంతే...! విచారపడకు! విచారపడకు!!

**బోయవాడు:** ( అమితమైన ఆవేదనతో )

ప్రభూ! ఎంతద్రోహం చేశాను? ఎంతపాపం చేశాను? అయ్యయ్యో! ... చేతులారా నా చక్కనయ్యను చంపుకున్నానే! లోకరక్షకుణ్ణి లేకుండా చేశానే...! కృష్ణా...! కృష్ణా...!!

[ అంటూ అరచి అరచి అతను ప్రాణం వదిలాడు. అంతలో శ్రీకృష్ణుని సారథి అక్కడకు వచ్చాడు. కృష్ణుని పరిస్థితిచూసి అతనుగుండె పగిలేటట్టు యేడ్చాడు. ఆయన పాదాలమీద పడి 'ప్రభూ! ప్రభూ!' అంటూ ఆక్రందించాడు. ]

**కృష్ణుడు :** దారుకా ! విచారపడకు ! నేను వచ్చిన పని అయిపోయింది. నా యింటికి నేను వెడుతున్నాను...! ఇందులో యెవరుగాని విచారపడవలసిన పనేముంది ? ...ఇక నువ్వు వెళ్లు ! వెళ్లి...యిక్కడ యిలా జరిగిందని అక్రూరునికీ విదురునికీ చెప్పు. స్త్రీలనూ పిల్లలనూ వృద్ధులనూ కరిపురానికి క్షేమంగా చేర్చుమన్నానని అర్జునునితో నామాటగా చెప్పు ! వెళ్లు నాయనా...! వెంటనే వెళ్లు !!

[ ఆ మాట అంటూనే శ్రీ కృష్ణ పరమాత్మ తన అవతారాన్ని చాలించాడు. అతనిలోనుంచి ఒక పెద్ద వెలుగు లేచి ఆకాశం వేపుగా వెళ్లింది.

ఆ వెంటనే ఆయన మీద పువ్వు వర్షం కురిసింది. ఆ అడవి అంతటా మురళీ ధ్వనులు మారు మోగిపోయినై. ]



# ★ 10. వ, రంగం ★

[ కథకుడు ఆ తరువాత జరిగిన గాథ చెబుతున్నాడు. ]

**కథకుడు:** ...ఆ విధంగా శ్రీ కృష్ణుడు తన మానవ శరీరాన్ని వదిలాడు. ఆ వెంటనే అక్కడఉన్న అతని దివ్య రథమూ, దివ్యాస్త్రాలూ, దివ్యాశ్వాలూ అన్నీ అంతర్ధానమై పోయినై.

అంతలో సముద్రం పొంగి వచ్చి ద్వారకా నగ రాన్ని ముంచేసింది. అప్పుడు అక్కడ ఉన్న జనాన్ని రక్షించటానికికూడా యెవరికీ అలవికాకపోయింది. అక్కడ అలా ఉండగా, వైకుంఠంలో ...



# ★ 11. వ, రంగం ★

[ అది వైకుంఠంలో విష్ణుమూర్తి కొలువు. బ్రహ్మ రుద్రాది దేవతలూ నారదాది మునులూ అక్కడ ఆయనను స్తోత్రం చేస్తున్నారు. ]

"విశ్వము లీల ద్రిప్పుచు న
విద్యకు జొట్టమైన నీకు దా
శాశ్వతమైన కాల మిది
సర్వము వేడబమందు రట్టి వి
శ్వేశ్వర మేలు కుప్ప నిను
నెవ్వడు గోరి భజించు వాడ పో
శాశ్వత లక్ష్మి మృత్యు జయ
సౌఖ్యయుతుం డభయుండు మాధవా"

[ విష్ణువు మందహాసం చేస్తూ లక్ష్మి వంక ఓరగా చూశాడు. అంతలో వేణునాదం వినవచ్చింది. దానితోపాటు ఒక పెద్ద వెలుగు వచ్చి, ముందుగా శ్రీహరి పాదాలమీద వ్రాలింది; ఆ వెంటనే పైకి లేచి ఆయనలో ఐక్యమైపోయింది. అది చూసిన అందరూ అమితాశ్చర్యంతో శ్రీహరికి సాగిలపడి మొక్కారు.

నారదుడు మాత్రం అమితోత్సాహంతో ...

"నారాయణా నారాయణా నారాయణా శ్రీమ
న్నారాయణా నారాయణా నారాయణా భగవ
న్నారాయణా నారాయణా నారాయణా ...
శ్రీమన్నారాయణా..."

అని పాడుతూ తన్మయత్వంతో నృత్యం చేయసాగాడు. ]

★ శ్రీ. శ్రీ. శ్రీ. ★

★



ఆనంద నామ సంవత్సర శ్రావణ శుద్ధ సప్తమి నాడు నేను బృందావనంలో పుట్టాను. ఆ తరువాత పదమూడేళ్లకు అక్షర రంగంలో అడుగు పెట్టాను.

'జగన్నాథుని స్తవం' తో నా కవితా జీవితం ప్రారంభ మయింది. ఆ తరువాత 'నీటి బుగ్గ', 'కవిత', 'బాల భాగవతం', అనే కావ్యాలూ, 'రాణీ సోమ', 'అమరజ్యోతి' 'మాధవశర్మ', 'జన్మభూమి', 'ఝాన్సీ రాణి', మొదలైన నాటకాలూ, 'డా. పట్టాభి', 'ఆంధ్ర రత్నం దుగ్గిరాల' 'ఆత్మూరి హవిర్యాజి', 'ఆంధ్ర కేసరి టంగుటూరి', మొదలైన జీవిత చరిత్రలూ యెన్నో వ్రాశాను; ప్రచురించాను. అవికాక అనేకమైన కథలూ ఖండ కృతులూ చాటువులూ కూడా వ్రాయటం జరిగింది.

1935-58 మధ్య కాలంలో కొన్ని దినపత్రికల సంపాదక వర్గంలో పనిచేశాను. అంతే కాదు; కొన్ని వారపత్రికలు స్వయంగా నడిపాను కూడా.

హైదరాబాదు సంస్థానంలో ప్రప్రథమంగా బాలోద్యమాన్ని ప్రారంభించాను. దానికోసం 'బాలభారతీ కళాకేంద్రం' అనే ఒక సంస్థను స్థాపించి నిర్వహించాను.

ఆ తరువాత చలనచిత్ర రంగంలో ప్రవేశించాను; రచయితగానూ, సహాయ దర్శకుడు గానూ కొంతకాలం వ్యవహరించాను.

అప్పుడే నన్ను నేను ప్రశ్నించుకున్నాను; 'ఇప్పటి వరకు నేను సాధించింది యేమిటి?' అని. 'ఏమీ లేదు' అన్న దృఢమైన సమాధానం నాకు వెంటనే లభించింది. అంతే. అది నాలో ఒక విధమైన అశాంతిని రేకెత్తించింది.

... అదే, యీ భాగవత కథా రచనకు పునాది.